# అప్పాజీ విజయము

రచయిత

శ్రీ దేవరకొండ చిన్నకృష్ణశర్మ

[పరిష్కృతము]




పబ్లిషర్సు:

బాలసరస్వతీ బుక్ డిపో,

ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు,

కర్నూలు.

బ్రాంచి ఆఫీసు: 6, సుంకురామశెట్టి వీధి, మద్రాసు-1.

1959



[వెల 1·12

# నివేదిక

తెలుఁగుజాతి చరిత్రలో శ్రీకృష్ణదేవరాయల పరిపాలనకాలము సువర్ణాధ్యాయము. రాయలవంటి రాజు, తిమ్మరుసువంటి ప్రధాని జతగూడినట్లు ప్రపంచములో నెందును గానరాదనుట సాహసము కాదు. ఈ చిన్నిపొత్తమున కితివృత్త మీ యుజ్జ్వల సన్నివేశము.

''బళిబళీ! మా తాత బల్లెంబు చేపట్టి పుల్లాకు తూట్లుగాఁ బొడిచినాఁడు'' అన్నట్లు పూర్వుల గొప్పతనము తలఁచి యిప్పటివారు ప్రమత్తులై యుండవలెననుట నెవరును మెచ్చరు. ప్రాచీనుల ప్రతిభావిశేషములు, ప్రజాజీవనసంగ్రామములో నుత్పన్నములైన సమస్యలు, వారు పరిష్కరించిన రీతులు నర్వాచీనులకు సువేద్యములై మార్గదర్శకములు కావలయును.

తళ్ళికోట యుద్ధమునకుఁ బిమ్మట సుమారు నాలుగు వందలయేండ్లకిప్పుడు తెలుఁగుజాతి కొక విశిష్టత తిరిగి లభించినది. ఈ యుత్తమావకాశము నాంధ్రులు చక్కఁగా వినియోగించుకొనవలయును. భావిపౌరులగు విద్యార్థులే యీ బాధ్యతను వహింపవలయును.

చిట్టిగంగనామాత్యుని యుపదేశము తిమ్మరుసు నెంతవానిని జేసెనో, తిమ్మరుసుసహకారము కృష్ణరాయల కెంత యుపకరించెనో, ఆ యా విశేషములన్నియు బాలబాలికలకుఁ జిత్తములందు హత్తుకొనునట్లే చిన్నిపొత్తమునఁ జిత్రితములు.

మహోదాత్తులగు సాళువ తుళువ నరసింహరాజులు, నవకాశ వాదులగు వెంకటయ్య తిమ్మయ్యలు, నవ్యక్తులగు సాళ్వరాజ కుమారులు, నింకను రకరకముల మనస్తత్త్వముల వ్యక్తులు నిందుఁ బాఠకులకుఁ బరిచితు లగుదురు.

సందర్భానుసారముగా నలఁతి యలఁతి వర్ణనలు, నలం కారార్థములగు నలంకారములు, భావబంధురములగు పద్యములు, కథాగమనమున కవిరుద్ధములుగాఁ గూర్పఁబడినవి. దీనివలన విద్యార్థులలో సాహితీపిపాస యుదయించి యుత్తమ కావ్యపఠనమం దభిరుచి పెంపొందఁగలదు.

ఉపవాచకములనఁగా నిన్ని లక్షణములు కలిగినవి కావలయును. అప్పుడే యవి సార్థకములు. విజ్ఞానపిపాస కలిగింపని వట్టి వినోదము ప్రమాదకరము. వినోదకరము గాని జ్ఞానోపదేశము చిత్తాకర్షకము కాదు.

ఇన్ని విచారించి శక్తివంచన లేక నెఱవేర్పఁబడిన యీ రచన పాఠ్యపుస్తకనిర్ణేతలకు, నుపాధ్యాయ పండితసోదరులకు, విద్యార్థి బృందమునకు మోదమును, పునఃపునఃపఠనోత్సాహమును గలిగింపఁగలదని నా విశ్వాసము.

ఇట్లు
విద్యద్విధేయుఁడు
**ర చ యి త**

౧

అది దక్షిణాపథమున కంతకు దుర్దినప్రాయమైన కాలము. చాళుక్యులు, చోళులు, కాకతీయులు, రెడ్లు మున్నగువారి యేలుబడు లంతరించినవి. చిన్నచిన్న రాజులు ప్రబలిరి. మహర్షి విద్యారణ్యుని యుపదేశమున హరిహర, బుక్కరాయసోదరులు స్థాపించిన విద్యానగర సామ్రాజ్యము కూడ నీ కాలమునాఁటికిఁ దేజోవిహీనమై యుండెను. విరూపాక్షరాయ లప్పటి విద్యానగర ప్రభువు. భోగవిలాసము లందు నిమగ్నుఁడైన యీ ప్రభువు రాజసభకు వచ్చుటయే యరుదుగ నుండెను. ఉద్యోగులు నిరంకుశులై యెవరికిఁ దోఁచినట్లు వారు సంచరించుచుండిరి. ఎక్కడి సామంతు లక్కడ స్వతంత్రు లగుచుండిరి. ఒకవైపు మహమ్మదీయు లొత్తుకొని వచ్చుచుండిరి. వేఱొక వంక గజపతులు చెలరేగుచుండిరి. ప్రజలకు శాంతి భద్రతలు కఱవయ్యెను. తెల్లవాఱునప్పటి కొక పటాలము గ్రామముమీఁదఁ బడును. ఒక రాజు పేరు చెప్పి యింటింట సుంకము వసూలు చేసికొని పోవును. ఆ రాజుపేరా గ్రామస్థు లంతకుము న్నెన్నఁడును వినియుండరు. ఆయన యెక్కడఁ బుట్టెనో, యెక్కడ పెరిగెనో, యెప్పుడు రాజయ్యెనో? అంతయు నయోమయముగా నుండును. తాము విద్యానగరేశ్వరుని ప్రజలమని వారి భావము. వా రాయనకుఁ గప్పములు చెల్లించుచునే యుండిరి. ఎవరో రాజోద్యోగులు వత్తురు. సుంకములు వసూలు చేసికొని పోవుదురు. నాలుగైదేండ్లకొకమాఱు వచ్చుట, చిక్కి-

నంత ధనము తీసికొనిపోవుట జరుగుచుండెను. ఈ నడుమ నదియును లేదు. బందిపోటుదొంగలు హెచ్చిరి. పటాలముల తాఁకిడుడు లధికమైనవి. ఈ పటాలములు తల కొక యేలిక పేరు చెప్పుచు, బలవంతముగా ద్రవ్యము తీసికొని పోఁజొచ్చినవి. అత్యాచారములు కూడ జరుగుచుండెను. ప్రజలు ప్రాణములు గుప్పిటఁ బట్టుకొని దిన మొక యుగముగాఁ గడపుచుండిరి.

అట్టి కాలమున నొకనాఁటి యుదయమున నొక యాశ్వికుఁడు చంద్రగిరి మండలములోని యొక కుగ్రామమునకు వచ్చెను. అతఁడు చాల దూరమునుండి ప్రయాణము చేయుచున్నట్లు చెమటచేఁ దడసిన యంగీవలనఁ దెల్లమగుచుండెను. దుస్తులను బట్టి, యాతఁ డొక సైనికాధికారి కావచ్చు నని తోఁచుచుండెను. ప్రజ లతనిని జూచుటకే భయపడుచుండిరి.

అప్పటి కించు మించు రెండు జాములై యుండును. అది గ్రీష్మకాల మగుటచే, నెండవేఁడిమి దుర్భరముగా నుండెను. ప్రొయ్యిమీఁది పెనమువలె నేల మండి పోఁదొడఁగెను. వేఁడి గాడ్పులు వీఁచుచుండెను. ఆ సమయమున నెదురెండలోఁ బయనించుట యసాధ్యమని యేమో, నాతు దిక్కులు పరికించుచుఁ దన గుఱ్ఱమును మెల్లమెల్లఁగా నడిపించుచుండెను. అతని ముఖలక్షణములను బట్టి యొకచోటఁ గొంత తడవు సేద దీర్చుకొనఁ గోరినట్లు కాన్పించుచుండెను.

ఆతని కల్లంత దూరమున నొక కుటీరము దృగ్గోచర మయ్యెను. ఆ కుటీర ప్రాంగణమునం దొక విప్రబాలుఁడు కూర్చుండి యేదో చదువుకొనుచుండెను. ఆబాలునికిఁ బదు నైదేండ్లుండవచ్చును. శరీరచ్ఛాయ బంగారమును వెక్కిరించు నట్లుండెను. విశాలమైన బ్రహ్మతేజస్సుఁజిమ్ము ఫాలము, నా కర్ణాంతములై మహాపురుష లక్షణమును వెలార్చు కన్నులు, సమున్నతమైన నాసిక, మిగుల నాకర్షణీయములుగాఁ గనుపట్టుచుండెను. ఆశ్వికుఁడచ్చటఁ దన గుఱ్ఱము డిగ్గి, సమీపస్థ వటవృక్షమునకు దానిని గట్టివైచి, బాలునిచెంతకు వచ్చెను. బాలుఁ డాతనిని జూడఁగనే ససంభ్రమముగా లేచి, నారికేళపత్ర విరచితాస్తరణముఁ జూపుచు 'విచ్చేయుఁ' డని యాహ్వానించెను. అతఁడు కూర్చున్న పిమ్మట 'మంచి తీర్థము కావలయునా?' యని ప్రశ్నించెను. ఆ యాదరోక్తికి సంతుష్టుఁడైన యాశ్వికుఁడు వాత్సల్యముతో 'అక్కఱలేదు బాబూ! నీ మృదుమధురాలాపములకే నా డప్పి యంతయుఁ దీరిపోయినది. నీవు చదువుచున్న యా గ్రంథమేమో చెప్పెదువా?' అని యడిగెను.

'ఇది కౌటిల్యుని యర్థశాస్త్రము'

'అర్థశాస్త్రమా! ఈ నాఁ డది యెవరికిఁ గావలయును?'

'అట్లందురేమి? సుపరిపాలనము మృగ్యముగా నున్న యీ దినములలో దీని యవసరమెంతైన నున్నదిగదా?'

'ఆ నియమముల నాచరణమునఁ బెట్టవలెననువా రున్నప్పుడు గదా దాని యవసరము?'

'నేఁడు గాకున్న చేపట్టికైనఁ బరిపాలకులకు దీనితో నవసరము రాకపోదు.'

'ఆహా! నీవంటివాఁడు మా మహామంత్రి శిక్షణలో గడి దేఱిన నెంత బాగుగా నుండును?'

'అయ్యా! ఆయన యెవరు?'

'నా దెండ్ల చిట్టి గంగనామాత్యులు!'

'ఓహో! వారా! వారు మాకు బంధుకోటిలోనివారే!'

'అటులనా! అయినచో నింకేమి? నీ వాయన యొద్ద నేల సుశిక్షితుఁడవు కారాదు? బంగారమునకుఁ దావి యబ్బిన చందమున నా ప్రజ్ఞానిధి శుశ్రూషచే నీ తెలివి తేటలు రాణించును గదా!'

'గంగనామాత్యులు బృహస్పతికి బుద్ధులు చెప్పఁగల వారు. కాని...అవ్యాజానుగ్రహముతో నా కుశల మరయు చున్న తమ దివ్యనామాక్షరము లడిగి తెలిసికొనని నా బుద్ధి మాంద్యమునకు సిగ్గిలుచున్నాను.'

'మేలు బాబూ! మేలు! నీ బుద్ధి వైశద్య మీ యొక్క ప్రశ్నతోఁ బ్రకాశిత మగుచున్నది. ఆ యమాత్యులు మాకు గురుతుల్యులు. చంద్రగిరీశ్వరుల కొలువులో నొక దళవాయిని నేను. నన్ను నరసనాయకుఁ డందురు.'

'తుళువవంశభూషణులగు తమ్ముగుఱించి వింటినే కాని, యింతవఱకును చూడ నవకాశము కలుగలేదు'

'ఈ సామాన్యుని గుఱించి వినఁదగిన విశేష మేమియు నుండదే!'

'తమ విక్రమము జగద్విదితము. దేశమంతయు నట్టుడికిన ట్లుడుకుచున్న యీ విపద్దశలో జను లించుక చల్లఁగా నుండుటకు హేతు వదియే కదా!'

'నాయనా! నాయొక్కని శూౌర్య మెంతవఱకుఁ బనికి వచ్చును? సాళువరాజేంద్రులు వృద్ధులు. గంగనామాత్యులెనుబదియవ పడిలోఁ బడినారు. ఆయనయారోగ్యము చాల వఱకుఁ జెడిపోయినది. రాయలవా రేమియుఁ బట్టించుకొనకుండుటచే నెక్కడి సామంతు లక్కడ నేలికలుగా విలసిల్లుచున్నారు. బాల నాయకత్వము, బహునాయకత్వము నన్నవి యెట్లుండునో ప్రత్యక్షముగాఁ గనఁబడుచున్నవి. రాయలవారి యాజ్ఞలేక సాళువరాజేంద్రు లేమి చేయఁగలరు? కావుననే మా పని ముందు నూయియు, వెనుక గోయియుగా నున్నది.'

'ఇది మీనమేషములు లెక్కించుచుఁ గూర్చుండుట కనువు గాని కాలము. సాహసించినఁగాని శ్రేయస్సు కలుగదు.'

'అదియే నా భావమును. అయినను నావలన నేమగును?'

'తేపు గజపతులే మనపైఁ బడినచో నేమిచేయుదురు?'

'మేనఁ బ్రాణములున్నంతవఱకుఁ బ్రతిఘటింతుము.'

'అందు మీకుఁ దోడ్పడువా రెవ్వరు?'

'ఎవరికి వారే!'

'అట్టి ప్రతిఘటనవలనఁ బ్రయోజన ముండునా?'

'కాని, రాజుదలంచుఁ గలిసిరారుగదా! ఏమి చేయఁగలము ?'

'విద్యానగరమే బలవంతమై శాసించిన మేలు కదా!'

'అట్టిది లేనందువలననే కదా యింత యవస్థ!'

'మనమే ప్రభుత్వము నేల చక్కఁబఱుపరాదు ?'

'నీ వా పని చేయఁగలవా ?'

'దైవానుగ్రహ మున్నచో.........'

'నీ యుపాయ మేమో చెప్పుము'

'దానికి ముందుగా నే నొక కథఁ జెప్పెదను. శ్రద్ధతో వినఁగోరెదను. ఒకదాత యొక యాలయముఁ గట్టించినాఁడు. యోగ్యుఁడని యెన్నికగన్న యొక పూజారి నందు నియమించినాఁడు. ధూపదీప నైవేద్యములకు వలసినంత యాదాయ మేర్పఱచి, తన యనంతర మా దేవాలయకార్యములు విచారించుటకు ధర్మకర్తలను నియమించినాఁడు. కొన్నాళ్లకతఁడు గతించినాఁడు. పూజారియును స్వర్గస్థుఁడైనాఁడు. ఆ దాత చేసిన యేర్పాటు ననుసరించి పూజారి కుమారుఁడర్చాదులు చేయవలసి యున్నది. కాని దేవాదాయము స్వార్థమునకే వినియోగించుకొనుటయు, దైవతార్చనయం దశ్రద్ధ వహించుటయు నతనికిఁ బరిపాటి యైనది. అప్పుడు ధర్మకర్తల కర్తవ్యమేమి ? యోగ్యుఁడైన వేఱొక పూజారిని నియమించుటయే కదా!'

'దాత యేర్పాటున కది భిన్నము కాదా!'

'దాత ముఖ్యోద్దేశము దేవాలయమున నర్చాదులు సక్రమముగా నడువవలెననుటయే కదా? ఇంక నేను మీకు విద్యారణ్యస్వామి – విద్యానగర స్థాపనము నను నంశములను గూర్చి చెప్పవలసినది లేదేమో!'

'గ్రహించితిని. మఱి నీవు నాతో వత్తువా?'

'మీ యభిప్రాయ మట్లున్నఁ గాదనుటెట్లు? అదిగో! నా సోదరుఁడు వచ్చినాఁడు. మన మింక భోజనాదికము లొనరించి యనంతర కార్యమును విచారింతము.'

ఆ బాలుఁ డిట్లు చెప్పుచుండఁగనే యతనివంటి మఱి యొక కుఱ్ఱవాఁ డచ్చటికి వచ్చెను. అతఁడును జక్కనివాఁడే కాని, కొంచెము చామనచాయ, బక్కపలుచనగు శరీరము గలవాఁడు. నిత్యవ్యాయామముచేత నేమో యాతని దేహము సుదృఢముగా నున్నది. మొదటి యువకుఁ డాతనిఁ జూచి, ''తమ్ముఁడా! వీరు మన పుణ్యవశమున నతిథులుగా వచ్చిరి. ముందుగా వీరి భోజనమున కేర్పాటు చేయుట మన విధి'' యనెను. అన్నగారి మాటలు విన్న యా బాలుఁడు నవ్వుచు 'మేనత్త యిల్లు వెడల నడిచినది మొదలుకొని మన కించుక శక్తి సామర్థ్యము లేర్పడినవిగదా! అతిథు లెందఱైన లోపము లేదు. మీరు కూడ భోజనమునకు లేవవచ్చును' అనెను.

నరసరాయఁ డా బాలుని పలుకులు విని యతనివంకఁ దేఱి చూచెను. ఆతని కక్షమున వ్రేలాడు జోలెవలన నప్పుడే యతఁడు మాధుకరమున కరిగి వచ్చెనని గ్రహించెను.

మాధుకరమే జీవనోపాధిగా నున్న నిఱుపేదలయింటఁ దా నా తిథ్యము స్వీకరింపవలసి వచ్చినందుల కాతఁ డొకింత లజ్జించెను; ఆ పేదపిల్లల యౌదార్యమున కెంతో సంతోషించెను.

సోదరు లతిథిని గలిగినంతటిలో సంతుష్టిపఱచి, తమ భోజనములను శీఘ్రముగా ముగించిరి. పిదప నరసరాయఁ డా బాలుర చరిత్ర మంతయుఁ దెలిసికొనెను.

అగ్రజుని పేరు తిమ్మరుసు; అనుజుని పేరు గోవింద రాజు. బాల్యముననే తల్లిదండ్రులు గతించుటచే నీ యన్న దమ్ములు మేనమామయింటఁ గొన్నాళ్లు పెరిగిరి. మేనత్త గయ్యాళి యగుటచే, మేనమామ సౌజన్యము వీరి కుపక రింపలేదు. ఆమె వారికిఁ జెప్పని పని లేదు. తిట్టని తిట్టు లేదు. చేతులారఁ దండిపెట్టిన దినము లేదు. నోరారఁ బలుకరించు టసలే లేదు. తిమ్మన్న, తిమ్మఁడు అనునవి పెద్ద వాని కామె పెట్టినపేళ్లు. తిమ్మన్న తమ్ముడు, జాంబవంతుఁడు ననునవి రెండవవాని పేళ్లు. పశువులను దోలుకొని పోయి మేపుకొని వచ్చుట, గోష్ఠము శుభ్రపఱుచుట, కస వూడ్చుట, చెఱువునకుఁ బోయి నీళ్లు తెచ్చుట వారు నిత్యముఁ జేయవలసిన పనులు. పాపము! మేనమామ యీ బాలురను బడిలోఁ జేర్చెనే కాని, మేనత్తదయవలన వీరు బడికిఁ బోవుటకు వీలే కలుగలేదు. అందుచేత మేనమామయే వీరి కింటియొద్దఁ గొంతవఱకుఁ జదువు చెప్పెను. ఆయన పాఠముఁ జెప్పుచున్నంతసేపు నిల్లా లింటిలో నాడు నాటక మత్యద్భుతమైనది. గిన్నెలు నేలకు విసరికొట్టును. పిల్లలను

బది తిట్టును. ఒక రిద్దఱిని గొట్టును. 'ఆ పని కాలేదు; ఈ పని మిగిలిపోయినది. ఇంకెఁడు చాకిరి చేయలేక చచ్చిపోవు చున్నాను. వండి వార్పఁగా వాయనములు చెల్లించుటకుఁ గావలసినంత మంది యున్నారు. చేతికిఁ గాలికి నడ్డుపడువారు లేనేలేరు. ఓ యమ్మా! చచ్చి యే లోకాన నున్నావో! ఈ కొంపలో నెముకలు విఱుగఁ బనిచేసి తనువుఁ దెల్ల వార్చుకొను టకే నన్ను గన్నావఁటే! ఏ నూయియో, గోయియో చూచు కొనవలెను. కాని నేనీ బ్రతుకు బ్రతుకలేనే!' అని వాపోవును. ఈ శోకాలతో నాఁటికిఁ భారముఁ గట్టిపెట్టవలసి వచ్చును. ఆమె మూఁడు మూఁడు దినములకుఁ దలకు వాసెన గట్టుకొని మంచ మెక్కును. నాఁటి వంటపెట్టులు వీరే చేయవలయును. 'అన్నము సరిగా నుడుకలేదు. తిరుగఁబోఁత మాడిపోయినది. పప్పులో నుప్పే లేదు' ఇట్టి యాక్షేపణలతో నామె మూఁడు కంచాలు చెల్లించును. అన్నదమ్ము లా యింట నున్నందువలన నేమి, మేనత్త యను గౌరవముచేత నేమి, యెదురు చెప్పక వారు చాలకాలము గడుపుకొని వచ్చిరి. కాని యా యిల్లాలికి వారిపై వాత్సల్యము, దయ కలుగనే లేదు.

ఇట్లుండఁగా మేనమామ గతించినాఁడు. మేనత్త కార్కశ్యము మితిమీఱినది. ఇట్టిస్థితిలోఁ దిమ్మరు సాకనాఁడు పశువులను బాలమునకుఁ దోలుకొని పోయెను. ఉదయమున నేమియుఁ దినకుండుటచేతను, ఎండ నిప్పులు చెఱఁగు చుండుటచేతను, నలసి సొలసి యతఁ డొక చెట్టుక్రింద మేను వాల్చెను. ఒడలెఱుఁగని నిద్ర పట్టెను. కొంతసేపటికి సూర్య కిరణము లతని మొగముపైఁ బడుచుండఁగా నొక ఫణి వచ్చి

యెండ తగులకుండఁ దన పడగ నతని మొగమునకుఁ బైగాఁ బట్టెను. అట్టి స్థితిలో నొక యోగి యటు వచ్చుట సంభవించెను. అతఁ డా విచిత్రదృశ్యముఁజూచి యాశ్చర్యపడెను. సర్ప మాతని రాక గమనించి యావలికిఁ బోయెను. యోగి బాలుని మేల్కొల్పి యతని వృత్తాంతమెల్ల నడిగి తెలిసికొని యిట్లనెను—'నాయనా! నీకుఁ ద్వరలోనే గొప్ప యోగము పట్టనున్నది. ఏకాకివై యిట్టి ప్రదేశములందు సంచరింపకుము. నీ విందనుక చదివిన దొక చదువు గాదు. చక్కగా విద్య నభ్యసింపుము. నీకుఁ దప్పక మంచి పదవి లభింపఁ గలదు.' పిమ్మట నతడు తిమ్మరుసును దీవించి యరిగెను. తిమ్మరుసు పశువులతో నింటికిఁ దిరిగి వచ్చెను. అతఁ డింటిలో నడుగుపెట్టుచు నొక దృశ్యముఁ జూచెను. మేనత్త గోవింద రాజుపైఁ బేడనీళ్లు కొట్టుచుండెను. ఆ బాలుఁ డేమియు ననక మొగమునకుఁ జేతు లడ్డుపెట్టుకొని దుఃఖించుచుండెను. తిమ్మరు సిఁక భరింపలేకపోయెను. అతఁడు మేనత్తతో 'అత్తా! ఇన్నాళ్లు మమ్ము పోషించినందులకుఁ గృతజ్ఞులము. ఇంకను నిన్ను శ్రమపెట్టఁజాలము. మాకు సెలవిమ్ము. ఎప్పుడైన మావలనఁ గావలసిన పని యున్నచోఁ గాకితోఁ గబురంపినను వచ్చి నీ యక్కఱఁ దీర్పఁగలము' అనెను.

వెంటనే తమ్ముని వెంటఁ బెట్టుకొని తిమ్మరు సా యూరిలోని యుపాధ్యాయునింటికిఁ బోయెను. తమకు విద్యాదానముఁ జేయవలసినదని యర్థించెను. ఆయన యతని వేఁడికోలు మన్నించెను. నాఁటినుండి యన్నదమ్ములు మధుకర వృత్తితోఁ బొట్టపోసికొనుచు విద్యాభ్యాసము సాగించిరి.

అప్పటికి సంస్కృతమునఁ గావ్య నాటకాలంకార సాహిత్య
మార్జించిరి. గోవిందరాజు వ్యాకరణ మింకను జదువు
చుండెను. తిమ్మరుసు వ్యాకరణము ముగించి తర్క మారం
భించెను. అది వారి పూర్వ చరిత్ర.

నరసరాయఁ డీ కథ యంతయు విని బాలురను
మఱింత ప్రేమించెను. నాఁటి సాయంకాలముననే యా యన్న
దమ్ములను దనవెంటఁ దీసికొని, యతఁడు చంద్రగిరికిఁ
బోయెను.

౨

'నాయనా! తిమ్మరుసూ! కలిపురుషుని విజృంభణము
దుర్వారముగా నున్నది. అటు మహమ్మదీయు లొత్తుకొని
వచ్చుచున్నారు. ఇటు గజపతులు చెలరేగినారు. తెలుఁగు
నేల కిఁక మంచి రోజులు లేవేమో!'

'మన మందుల కేల ప్రయత్నింపరాదు?'

'ఎట్లు ప్రయత్నింపఁగలము? ఏమి చేయఁబోయినను
స్వామిద్రోహముగాఁ బరిగణనకు వచ్చును.'

'అట్లని దేశము నింకను విపత్కరస్థితికిఁ గొనివత్తుమా?'

'ఇప్పుడు మన కర్తవ్యమేమి?'

'బృహస్పతులకు నే నాలోచన చెప్పఁదగినవాఁడనా?'

'ఈ విషయమున కేమిలే! చూడు; మనము విద్యా
నగరము నాక్రమింతుమనుకో! లోకు లేమనుకొందురు?'

'మహమ్మదీయులే యాక్రమించుకొన్నచో?'

'అది సహింపరానిదే కాని.........'

'తాతగారూ! నాఁడు చంద్రగిరి ప్రభుత్వము మాత్రము నిలువఁ గలదా?'

'నిలువలేని మాటయు సత్యమే!'

'కనుకనే విద్యానగరమును మన యదుపునం దుంచుకొనవలయును.'

'నాఁడు మాత్రము మనకు విరోధు లధికులు కారా?'

'మన కొక బలమైన దుర్గము చిక్కఁగలదు. విరూపాక్షునియెడ విరక్తులైనవా రందఱు మన కండగా నిలువఁ గలరు. అతఁడు తన యకృత్యములకుఁ బశ్చాత్తప్తుఁడై రాజ్య మేల నర్హుఁడనిపించుకొన్నచో నతనికి రాజ్యమునప్పగింపవచ్చును.

'మన యుద్దేశములోని నైర్మల్యము నితరులు గుర్తింప వలదా?'

'అంతదనుక నాలసించినఁ బరిస్థితులు విషమింపవా?'

'మఱి యీ పని నీవు చేయఁగలవా?'

'నరసనాయకుల తోడ్పాటున్నచో...'

'అతఁడందులకు సంసిద్ధుఁడయియే యున్నాఁడు'

'ఐనచో మహారాజుగారి యనుమతియే యవశిష్టము.'

'నాయనా! నృసింహరాయఁడు నావలెనే సంశయగ్రస్తుఁడై యున్నాఁడు. మేము పూర్వకాలపువారము. అతని కఱువది నిండినవి. నాకెనుఁబది దాఁటినవి. ఈ ముదిమికిఁ దోడు ఛాందసము బలిసి మాకే కార్యమునకును సాహసము కలుగుట లేదు. నరసనాయకుఁడైదవ పదిలోఁ బడినను, శౌర్యోత్సాహములు పెరుగుచున్నవి గాని తరుగుట లేదు. నీ వతనికిఁ దోడైనచో నగ్నికి వాయువువలెఁ బొందు పొసఁగును.'

'మీ యాశీర్వాదమున నెంతటి కార్యమునైన సాధింపఁగల నను విశ్వాసము నాకున్నది.'

'విజయీ భవ! బాబూ! పిన్నవాండ్రగు మి మ్మా యగ్ని కుండమునఁ జొప్పించుటకు మనసొప్పక యింత సందేహించితిని. ఈ స్థితిలో మన కింతకంటెఁ గర్తవ్యము లేదని నేను నిశ్చయించియే యుంటిని. నా నిశ్చయమునే నీవును బలపఱచితివి. కాని నీవు విద్యానగరము నెట్లు చేపట్టఁగలవో యొకించుక చెప్పుము.'

'నరసనాయకుఁడల్పపరివారముతో యాత్రకోఱకన్నట్లు బయలుదేఱును. సైనికు లందఱుఁ జిన్నచిన్న జట్లుగా సార్థవాహులవలె, యాత్రికులవలె, భిక్షుకులవలె నిర్ణీతసమయమునకు విద్యానగరముఁ జేరుకొందురు. ఇంతలో నేనును, గోవిందుఁడును విద్యార్థులవలె నందుఁ బ్రవేశముఁ గల్గించుకొందుము. ఉద్యోగులలో నెవరెవ రెటువంటివారో పరి

శీలింతుము. జ్యోతిషికులమై రాజోద్యోగుల చెలిమి సంపాదింతుము.'

'సెబాస్, తిమ్మరుసూ! ముద్రారాక్షసముఁ జదివి నంపులకుఁ దగిన ప్రజ్ఞఁ జూపుదువుగాక! రేపు దశమి, శుక్రవారము; రేవతి దినమంతయు నున్నది. అభిజిత్తునఁ బ్రయాణమైనచో విజయలక్ష్మి మిమ్ము తప్పక వరింపఁగలదు.''

పై ప్రసంగమువలన నా వ్యక్తులలో నొకఁడు తిమ్మరుసని స్పష్టమగుచున్నది. రెండవ వ్యక్తి చిట్టిగంగనామాత్యుఁడు. సాళువ నృసింహరాయల ప్రధానమంత్రి! నాఁడట్లు తిమ్మరుసుని నతని తమ్ముని వెంట నిడుకొని బయలుదేఱిన నరసనాయకుఁడు చంద్రగిరికిఁ జేరి, యమాత్యుని సందర్శించి యా బాలుర చరిత్ర మామూలాగ్రము నివేదించెను. ప్రధానియు నా సోదరుల తేజోవిశేషములకు ముచ్చటపడి, వారు తనకు బంధుకోటిలోనే చేరినవారగుటఁ దన యింటనే యుంచుకొని విద్యాబుద్ధులకు మెఱుఁగు పెట్టుచుండెను. గోవిందరాజు వ్యూహనిర్మాణమును, గదనకౌశలము నభిమానించినంతగా నితరవిషయముల నభిమానింపలేదు. తిమ్మరుసు సకల విషయములందును జాగరూకత వహించి గంగనామాత్యుని ప్రీతికిఁ బాత్రుఁడయ్యెను. కనుకనే యమాత్యుఁ డీ కార్యభారమును దిమ్మరుసుమీఁద నుంచి నిశ్చింతుఁడయ్యెను.

తిమ్మరుసు ప్రధానియానతి, శిరసావహించి, తమ్ముని తోను, నరసనాయకునితోను గలసి విద్యానగరాభిముఖుఁడై

యరిగెను. గంగనామాత్యుఁడు, తనువు చంద్రగిరియందును, మనస్సు విద్యానగరమందును బెట్టి, ఫలితమునకై నిరీక్షించు చుండెను. నరసింహభూపతిస్థితియు నట్లే యుండెను. నిశ్చయముగా నది యొక మహాసాహసము. చంద్రగిరిసేన విద్యానగర సేనలో నాల్గవవంతైన లేదు. యుద్ధమే చేయవలసి వచ్చినచో జయము లభించునని తలచుటకు వీలులేదు. ఏదో యొకరీతిగా విద్యానగరము స్వాధీనమైనను, జుట్టుపట్లఁగల రాజులతోఁగలహములు సంభవించునుగదా! అప్పుడు జయమెట్లు కలుగును? తన మంత్రి మహాబుద్ధిశాలియే! చక్కఁగా నాలోచింపక యేకార్యమైనను నిశ్చయింపఁడు. అట్టివాఁడిటువంటి తెగువ సేయుట యేల? ఇదేదో దివ్యసంకల్పమువలన జరుగుచున్నది. లేనిచోఁ దానుమాత్ర మేల యంగీకరించును?

రాజును మంత్రియు నిట్టి యాలోచనలతోఁ బది దినములు గడపిరి. పదునొకండవనాఁడు విద్యానగరమునుండి యొక చారుఁడు వచ్చి మహామంత్రిని సందర్శించి నరసనాయకుని విజయమును సంగ్రహముగా వినిపించెను. మంచముపైనుండి లేవలేని యమాత్యుఁడా వార్త విని సంతోషమే బలముగా నా చారుని వెంట నిడికొని సభామందిరమునకుఁ బోయెను.

వృద్ధుఁడై, రోగపీడితుఁడై, యిలువెడల లేని మహామంత్రి సోత్సాహియై, సభకు వచ్చుటఁ జూచి యేదో గొప్ప విశేషమున్నదని మహారాజు నిశ్చయించెను. అతఁడు సింహా

సనము దిగి యాయన కెదురేగి, సాదరముతో నుచితాసన మందుఁ గూర్చుండఁబెట్టెను. అంతట మహామంత్రి యిట్లనెను.

'ప్రభూ! ఏ సమస్యను బరిష్కరించుటకు నే నిన్నాళ్ళ నుండియు నాలోచించుచుంటినో, యది నేఁడు తిమ్మరుసు, నరసనాయకులచేఁ బరిష్కృతమైనది. విద్యానగర మేలినవారి సొమ్మయినది. విశేషములన్నియు నీచారుఁడు విన్నవింపఁగలఁడు.' పిమ్మట మహారాజు చారునివంక చూపు సారింపఁగా నతఁడిట్లు చెప్పఁదొడఁగెను.

'దేవా! తిమ్మరుసు నరసనాయకు లిట్లు చెప్పినారు— 'విరూపాక్షపీఠధర్మకర్తృత్వము సాళువవంశమున కిప్పటి నుండి చెల్లుబడి కావలెనని స్వామి సంకల్పించినాఁడు. ప్రజలు దేవర సందర్శనమున కెదురుచూచుచున్నారు. విద్యానగర రత్నసింహాసనము ప్రభువుల యధివాస భాగ్యమున ధన్యముకా నభిలషించుచున్నది. సామాత్యులై యేలినవారెన్నఁడు దర్శన మిత్తురా యని మేము ప్రతీక్షించుచున్నాము.'

ఈ వార్త విన్నంతనే నృసింహభూపతి తన కంఠ మందలి రత్నహార మా చారునకుఁ బ్రసాదించి సభాసదులతో నిట్లనెను—

'మొదటి విరూపాక్షరాయలవారు కుమారునిచేతనే నిహతులైనా రన్న దారుణవార్త మీ రంద ఱిదివఱకే విని యున్నారు. ఆ పితృహంత రాజ్యలోభముచే నంతటి పాప మొనర్చినను, దానిని నిలుపుకొనలేక, యల్లురకుఁ

బెత్తన మిచ్చి రాజ్యమంతయు నశాంతికి, నరాజకమునకు నెలవుగాఁ జేసినట్లును మీ రెఱుఁగుదురు. అతఁడు రెండవ విరూపాక్షుని కత్తికెఱ యయ్యెను. ఈ భ్రాతృద్రోహ ఫలిత ముగా నతఁ డుద్యోగుల చేతి కీలుబొమ్మయై దేశము నరాజకముఁ జేసి తనకును, దేశమునకును విపత్తుఁ దెచ్చిపెట్టినాఁడు. ఇందు వలనఁ జంద్రగిరి వంటి చిన్న రాజ్యము లెంతో కాలము నిలువ నేరవని విస్పష్టమైనది. ఇన్నాళ్లనుండియు విద్యానగరేశ్వరుని కెదురు తిరుగుట స్వామిద్రోహమగు నను శంకతో నాలసించి యుంటిమి. ఇప్పుడు మొదటికే మోసము రానుండుట చేత, యావదాంధ్ర సౌభాగ్య పరిరక్షాభిలాష చేత మనము విద్యానగరమును గైవసముఁ జేసికొనవలసి వచ్చినది. ఇట్లొనర్చుట యసమంజసమని తోఁచినవా రెవరైన నున్న-చో నిర్భయ ముగాఁ దమ యభిప్రాయముఁ జెప్పవచ్చును.'

అది యసమంజసమని సభలో నొక్కరును వాకొనలేదు. పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి మున్నగువా రామోదమును దెల్పి, నరసింహరాయ లొనర్చిన ఘనకార్యము దేశాభ్యుదయకారక మనియు, విజయనగర రాజ్యాభ్యున్నతికిఁ గారణ మనియుఁ దెల్పి రాజును, మంత్రిని బ్రశంసించిరి.

పిదప మహామంత్రి లేచి 'మన నృసింహభూపతి యర్హత మీ కందఱకును తెలియును. ఇట్టి యోగ్యులయిన యేలికల పాలనలో విద్యానగర సామ్రాజ్యము మన పినవీర భద్రాదు లాశంసించినట్లు తెలుఁగు తెలివి, తెలుఁగు పౌరుషము, తెలుఁగుభాష, తెలుఁగు సంస్కృతి, తెలుఁగు భాగ్యము

సర్వతోముఖముగాఁ బ్రకాశింపఁజేయునదియై వర్ధిల్లవలయును. మీ రందరు నిందులకుఁ బ్రోత్సహింతురుగాక !' అని పలికెను. వెంటనే జయజయధ్వానములతో సభ యంతయు నుత్సాహానందములు ప్రకటించెను. మఱునాఁడే విద్యానగర ప్రయాణమని నిర్ణయ మగుటతో సభ ముగిసెను.

మఱునాఁడు మహారాజు సపరివారముగా విద్యానగరమునకు బయలు దేరెను. విద్యానగరము చేరఁగనే నరసనాయకులు, విద్యానగరమందలి ప్రధానోద్యోగులు, పౌరముఖ్యులు మహావైభవముగా నెదురువోయి అతనిని పురమునఁ బ్రవేశపెట్టిరి. దేవాలయములనుండి యర్చకులు ప్రసాదములు గొని వచ్చిరి. నృసింహభూపతి సానుచరుఁడై విప్రులకు నమస్కరించి, దేవప్రసాదము స్వీకరించి కన్నుల కద్దుకొని, హరిహరాదు లధిష్ఠించిన యా దివ్యరత్న సింహాసనమున కంజలించి, పారిషదుల యామోదము వడసి యా పీఠము నధివసించెను. భూసురాశీర్వాదములు, మంగళవాద్యధ్వనులు బోరుకొనెను.

అంతట నా కలకలమును నివారించుచు మహారాజు నను మతితోఁ బ్రధానసచివుఁ డి ట్లుపన్యసించెను – 'నానాఁటికి మితిమీఱు వైదేశికాక్రమణమును నిరోధించి, స్వదేశగౌరవమును నిలుపుటకై స్వామి విద్యారణ్యుఁడు హరిహరరాయలవారిచే నీ విరూపాక్షక్షేత్రమున రాజధానిని గట్టించెనని మీ రెల్ల రెఱుఁగుదురు. హరిహరరాయ లేమి, బుక్కరాయ లేమి, తరువాతి రాజన్యు లేమి, యా స్వామి సంకల్పమున కనుగుణముగాఁ బ్రభుత్వమును నెఱపుచునే వచ్చిరి. ఇటీవలనే ప్రభుత్వ

సౌష్ఠవము సడలుటయుఁ దత్ఫలముగా నాంధ్రదేశ మొక్కచే యననేమి, యావద్దక్షిణభారతము వైదేశిక దండయాత్రలతో, నంతఃకలహాములతో నల్లకల్లోలమగుటయు సంభవించినది. ఎక్కడివా రక్కడ స్వతంత్రులగుట, యొండొరులతోఁ గలహించుటల మూలమున బాలనాయకత్వము, బహునాయకత్వమును బ్రబలిపోయినవి. ఎవరికివారే కప్పము లడుగుచుండుటవలనఁ బ్రజ లడిగినవారికెల్ల సుంకములు చెల్లింపవలసి వచ్చుటయు, శాంతిభద్రతలకు మాత్ర మెవరిని నమ్మ శక్యము గాకుండుటయుఁ దటస్థించినది. ఇట్టి స్థితిని జంద్రగిరి యుపేక్షింపలేకపోయినది. విద్యానగరమును బలపఱచి, శత్రుదుర్భేద్య మొనర్చి, యావదాంధ్రజాతి నేకోన్ముఖముచేసి స్వతంత్రజాతిగాఁ దీర్చిదిద్ద సంకల్పించినది. కనుకనే నేఁ డీ సాహసము చేయవలసివచ్చినది. రాయ లీ మహాభారముఁ జక్కగా నిర్వహింపఁగలరని మీ రందఱు నిశ్చయించినచో వారికీ గద్దియ నొప్పగించుటకు సాళ్వభూపతులు సంసిద్ధులై యున్నారు' అని యతఁ డింకేమో చెప్పఁబోవుచుండఁగనే సభలో నలుమూలలనుండియు 'సాళ్వ నృసింహరాయలవారే మా చక్రవర్తు'లను నినాదము లధికములయ్యెను. అంతట నృసింహభూపతి సంతోషవినయములు సందడింపఁగా సభాసదులను గలయఁజూచి యిట్లనెను– 'ఈ మహాభారమును నేను వహింపఁగలనని మీరందఱు నన్ను విశ్వసించినందుల కెంతేనిఁ గృతజ్ఞుఁడను. నా శక్తి వంచన లేకుండ దేశ క్షేమమునకై కృషిచేయఁగలనని శపథము

చేయుచున్నాను. నేను గాని, మఱియొకరు గాని, యీ గద్దె నెక్కినవారు తమ యర్హత నిలుపుకొనలేనిచో, నట్టివారిని బదభ్రష్టులను జేసి యోగ్యులను బీఠమెక్కించు నధికార మీ సభదే యని యుద్ఘాటించుచున్నాను. వాస్తవమున కీ రాజ్యము విరూపాక్షస్వామి దనియు, నిందలిరాజు లీదేవస్థానమునకు ధర్మకర్తలు మాత్రమే యనియు నెల్లరకు విదితము. కనుక నీ సామ్రాజ్యాధిపత్యము యోగ్యతవలనఁ బొందఁదగినదే కాని, యౌరసత్వ మాత్రముచే లభింపఁదగినది కాదు. నా కుమారుఁ డయోగ్యుఁడయినచోఁ బదభ్రష్టుఁడు కావలసినదే! ధైర్య స్థైర్యములు, ప్రజాసేవాపరాయణత, యుక్తాయుక్త వివేకము, శౌర్యకారుణ్యములు నెవనియందు నెలకొనునో వాఁడే మనలను నడపింపఁదగినవాఁడు. వీనిలో నాయం దేవి లోపించినట్లు మీకుఁ దోఁచినను నే నీ పీఠము దిగి, నాచేతనైన సేవ దేశమునకుఁ జేయఁగలను.'

మఱల 'మీరే మా ప్రభువులు. మీరే మా ప్రభువులు' అని సభ్యు లేకగ్రీవముగ ఘోషించిరి. ప్రధానికన్నులలో గర్వరేఖ మెఱసెను. సార్వభౌముని ముఖమునఁ గృతజ్ఞత చూపుగట్టెను. తిమ్మరుసు, నరసనాయకులు హర్షవివశులైరి. 'జయజయ విద్యా నగరేశ్వరా! జయజయ సాళ్వ వంశాలంకారా! జయజయ నృసింహసార్వభౌమా!' యను వందిమాగధ స్తుతులు నివ్వటిల్లెను.

3

సాళువ నృసింహభూపతి కిద్దఱు కుమారులు. వీరూ పాండురాయలవలెనే వీరును దమ కబ్బిన సదవకాశమును దుర్వినియోగ మొనర్పఁజొచ్చిరి. తిమ్మరుసు వారి నెన్నో విధముల సన్మార్గమునకుఁ ద్రిప్పఁజూచెను. అవి యన్నియు బూడిదలోఁ బన్నీరు వోయుటయ్యెను. విద్యానగర ప్రవేశమునాఁటికే యనారోగ్యపీడితుఁడై యున్న చిట్టిగంగనామాత్యుఁ డచిరకాలముననే పరలోకగతుఁ డయ్యెను. ఆయన తన యంత్యసమయమునఁ దిమ్మరుసును బిలిచి 'నాయనా! నా యనంతరము తెలుఁగుసీమ నుద్ధరించు భారము నీపై నిడి నిశ్చింతుఁడనై తనువుఁ జాలించుచున్నాను. మొగమోటములకుఁ జోటీయక యీ విద్యానగర రాజ్యమును సక్రమముగా సేవించుట నీ విధి. సాళువరాజ కుమారులు గూడ నిస్తేజులుగనే కనుపట్టుచున్నారు. భద్రముగా మెలఁగుము. ఆంధ్రజాతి శ్రేయస్సు మాత్రమే పరమ లక్ష్యముగాఁ జూచుకొనుము.' అని చెప్పెను. తిమ్మరుసాయన యంత్యోపదేశమును దప్పక పాలింతునని వాగ్దానము చేసెను. మరణ సమయమందుఁ దన యిల్లు, తన బిడ్డలు ననక దేశాభ్యున్నతికొఱకు మాత్రమే విచారించిన చిట్టి గంగనామాత్యుఁ డెంతటి దేశాభిమాని! తిమ్మరుసు వాగ్దానముతో నతఁడు సంతృప్తిగాఁ గనులు మూసెను.

ఆపద లొకదాని వెంట నొకటి వచ్చును. విద్యానగరమును శత్రుదుర్నిరీక్ష్యముగా నేలుచున్న నృసింహ భూపతి

యాకస్మికముగా వ్యాధిగ్రస్తుఁ డయ్యెను. యౌవనదశలో నెట్టి రోగములు సంభవించినను శరీరము భరింపఁగలదు. పాటవము దప్పిన పిమ్మట నల్పవ్యాధికే దేహ మలసిపోవును. వైద్యుల మందు లేమయ్యెనో! నానాఁటికి రాజు నిస్తేజుఁడగు చుండెను. కొడుకులు తండ్రివిషయము విచారింపక భోగ విలాసములలో నిమగ్నులై యుండిరి. అంతఃపుర కాంతలు, తిమ్మరుసు, నరసనాయకులు ప్రభువును గనిపెట్టుకొని యుండిరి. ఎందరెన్ని పరిచర్య లొనర్చుచున్నను, ఎన్ని మందులు వాడినను, మృత్యువు నిర్నిరోధ మైనది. తన కంతిమకాలము ప్రాప్తించినదని మహారాజు గ్రహించెను. కనుసన్నలనే నితరులనందఱ నావలకుఁబంపి ప్రభువు తిమ్మరుసు, నరసనాయకు లను దగ్గఱకుఁ బిలిచి యిట్లనెను—'కొలఁదిసేపటిలో నా జీవి తము ముగియఁగలదు. దైవప్రేరణచేతనే మన మీ విద్యా నగరమున నెలకొంటిమి. నావలన నైనంతవఱకీ సామ్రా జ్యమును బలపఱచుటకుఁ గృషిచేసితిని. ఇందుఁ దొలుతటి నుండియు నాతో సహకరించినవారు మీరు! ఈ ప్రయత్న మందలి పరమార్థమును మీకు నేను మఱల జ్ఞప్తిచేయ నక్కఱ లేదు. నా కుమారులలో నెవ్వఁడు యోగ్యుఁడో వానికిఁ బట్టముఁగట్టుఁడు. వారు యోగ్యులు కానినాఁడు మీరే యీ భారమును వహింపుఁడు.' నరసనాయకుఁ డిట్లు పలికెను 'ప్రభూ! రాకుమారులు పిన్నలు కనుక నేఁడేదియుఁ బట్టించు కొనకున్నను గొన్నాళ్లకైన వారు తమ బాధ్యత గ్రహింపక పోరు. కనుక యథావిధిగా యువరాజును సింహాసనమునఁ

గూర్చుండఁబెట్టి తక్కిన కార్యములు మేము చూచుకొందుము. మా ప్రాణము లుండఁగా నీ సామ్రాజ్యము చెక్కుచెదరదని విశ్వసింపుఁడు.' నృసింహభూపతి కనులలో సంతృప్తి తాండవించెను.

ఆ మఱునాఁడే మహారాజు కీర్తిశేషుఁడయ్యెను. నరసనాయకుఁడు యువరాజునకుఁ బట్టాభిషేకము గావించి, తిమ్మరుసు ప్రధానిగాఁ, దాను సైన్యాధికారిగా వేయి కన్నులతోఁ బాలనము సాగించుచుండెను.

ప్రభువు యువకుఁడు. యౌవనసహజమైన విషయాభిలాష యతనియందుఁ బరమావధిఁ గాంచెను. అహంకారము మేరమీఱెను. 'ఈ ధనము నా భోగములనిమిత్తమే యుపయోగింపఁదగినది. ఈ ప్రజలందఱు నా బానిసలు. నా సౌఖ్యమునకై వీరు పన్నులు చెల్లింపవలయును' అను భావము లతనిలో నాటుకొని తలలెత్తి యల్లిబిల్లిగా నల్లుకొనిపోయెను. స్తుతిపాఠకు లతని కాప్తులైరి. హితోపదేశకులు ద్వేష్యులైరి. తిమ్మరుసుతో నాలోచించుట గిట్టకపోయెను. నరసనాయకునికి దర్శనమే యరుదయ్యెను. ఎల్ల వేళలందును 'వెంకటయ్య' యతని ప్రక్క నుండవలెను.

వెంకటయ్య విరూపాక్షరాయలవారి కాలమునుండియుఁ గొలువులోనున్న యొక దళవాయి. గజపతులను విద్యానగరము మీఁదికి దండెత్తి రావలయునని యాహ్వానించినవాఁ డీతఁడే యని వదంతి. కాని విరూపాక్షరాయలవారీ విశ్వాసఘాతకునిఁ గనిపెట్టలేకపోయిరి. దానికి హేతువు లాతని యతివినయము,

జేసి మూఢవిశ్వాసమును. ముఖప్రీతివచనము లతని సొమ్ము! ఎంత ప్రీతి యున్న నది యంతయు మాటలలోఁ బ్రకటించుట సామాన్యముగా నసాధ్యమైన విషయము. లేని ప్రీతిని బ్రకటించుట యన్న నిఁకెంత కష్టమో యూహింపవచ్చును. ఈ సామర్థ్యము వెంకటయ్యయందు సుసంభవమైనది. రాజును జూచినంతనే యతఁ డిట్లనును—'ఓహో! నలకూబరులవారు కంటఁబడినారు, నాకన్నుల కఱవు దీరినది. పూర్వము గోపాల కృష్ణుని సందర్శనమునకై వ్రేపల్లె, మధుర, ద్వారక మొదలయిన నగరము లన్నియు నిట్లే తహతహ లాడెనఁట! 'పుంసాం మోహనరూపాయ సార్వభౌమాయ మంగళ'మ్మని నాఁటి శ్రీరామచంద్రుని మహర్షులు కీర్తించిరి. ఆ భాగవతము, నా రామాయణము వట్టి కబురులమాటలు, నసంబద్ధ గాథలు నని మొన్న మొన్నటివఱకు ననుకొంటిని. దేవర వారి సందర్శన మైన పిమ్మట నా యవివేకము నాకుఁ దెలియ వచ్చినది. ప్రభువులను జూచుచున్నంతసేపును నేను నన్ను మఱచిపోవుదును. నే నొక దాదినై యంతఃపురమున నుండి యున్న మీ దివ్యసుందరవిగ్రహము నొడియం దుంచుకొని పెంచి యుందును గదా! నా కట్టి భాగ్యము కలుగక పోయెనే యని విచారింపని దినము లేదు.'

రాజా పలుకులకుఁ బొంగిపోవును. వెంకటయ్య యా యవకాశమును వ్యర్థము కానీయలేదు. సమయము చూచి నరసరాజుపైని, తిమ్మరుసుపైని కొండెములు చెప్పసాగెను. 'ఆ నరసనాయకుఁడు తానే యేలిక ననుకొనుచున్నాఁడు.

కాని దేవరవారిని ప్రభువుగాఁ బరిగణించుట లేదు. అతని కా తిమ్మరాజొకఁడు తోడైనాఁడు. వానిని గ్రిందఁ బెట్టినఁ బంట లుండవు; పైని పెట్టిన వాన లుండవు. ఈ యిద్దఱును గలసి నాపైఁ బెత్తనము చేయుచున్నారు. వీరేనాఁడో ప్రభువులకుఁ గూడ ద్రోహము తలపెట్టఁగల రని నాకు భయ మగుచున్నది' అని వెంకటయ్య యనెను. 'ఐనచో వా రిద్దఱిని రాజద్రోహులని చెప్పి యేల యురితీయింపరాదు?' అని ప్రభు వడిగెను. 'స్వామీ! మీ రింకను బెరటిత్రోవనే యున్నారు. తమ కొలువులోని యుద్యోగులందఱును వారికి వెఱతురు. నగరాధికారి మొదలుకొని ద్వారపాలకుని వఱకు వారి యనుచరులే! మీ యాజ్ఞాపత్రము మీరు చదువుకొన వలసినదే కాని యితరులు దానిని జూడనైనఁజూడరు. కనుక నిది కాదు కార్యము' అని యతఁడు బదులు పలికెను. 'ఈ సంహార నాటకమునకు నీవే సూత్రధారుఁడవు కావలెను. నీవు చేయు పనిలో మావలనఁ గావలసిన దేమైన నున్నచోఁ జెప్పుము. అది నెఱవేర్చుటకు సిద్ధముగా నున్నాము' అని ప్రభు వతని నడిగెను. 'మనము నరసనాయకు నొక్కని నిటకుఁ బిలువనంపి యుపాయముచేఁ గడతేర్పవలయును' అని వెంకటయ్య యుపదేశించెను. ఆ తిమ్మరాజసాధ్యుఁ డంటివి కదా! వాని మాటయేమి?' యని రాజు తిరిగి యడిగెను. ఈ కార్యము ముగిసిన వెంటనే వానిపై రాజద్రోహము నారో పించి శిక్షింపవచ్చును. లేదా మన మొక యాజ్ఞాపత్రము సృజించి మన నిర్బంధమందున్న నరసనాయకునిచే దానిపైఁ

జేౘవాలు చేయింతము. దానితో తిమ్మరుసుపొగ రణఁగును' అని వెంకటయ్య సమాధానము చెప్పెను.

*   *   *   *

అది నడురేయి. అమావాస్య యగుటచేతఁ జీఁకటి దట్టముగా నుండెను. అప్పుడప్పుడు వినవచ్చు కుక్క మొఱుగులు తప్ప మఱి యే శబ్దమును వినవచ్చుట లేదు. ఆ రేయి చాలసేపు తిమ్మరుసుతో రాజ్యాంగవిషయములు ముచ్చటించి నరసనాయకుఁ డతనిని సాగనంపి సెజ్జపై మేను వ్రాల్చెను. పండుకొనెనే కాని యతని మనస్సు స్వస్థపడకుండుటచే నిదుర పట్టదయ్యెను. రాజు వెంకటయ్యచేతిలోఁ గీలుబొమ్మగా నాడుచుండుటయు, హితకాంక్షులగు తిమ్మరుసును, దన్నును నిర్లక్ష్యముగాఁ జూచుటయు నతనికి వేదనఁ గల్గించెను.

ముందే తిమ్మరు సతనికిట్లు చెప్పియుండెను—'రాజిప్పుడు కలియుగ కృష్ణుఁడైనాఁడు. వెంకటయ్య యుద్ధవుఁడైనాఁడు. తమకుఁ గంసపాత్రము కట్టిపెట్టఁబడినది. నన్ను గ్రింద నుంచినఁ బంటలు, పైనుంచిన వానలు నుండవఁట! అంతఃపుర దాసి యొకతె నాకీనాటకమంతయుఁ జెప్పినది. ఆ గోపాలకృష్ణుఁడే వేళ మీఁది కుఱుకునో! మీ రప్రమత్తులరై యుండవలయును. శత్రు సంహారమునకు సుముహూర్తము దగ్గఱలోనే పెట్టఁబడినదఁట!'

నరసనాయకున కా పలుకులు కొంతవఱకు వినోద హేతువులైనవి; భయ హేతువులు కాకపోయినను విచార హేతువులయ్యెను. 'ఆ వెంకటయ్య గోముఖవ్యాఘ్రము. వానిని

దరిఁజేర్చిన ప్రభువున కే వేళ నేమి హాని కలుగునో! ఎంత చెప్పిన నతఁడు వినిపించుకొనఁడు. తనకుఁ గనఁబడుటయే మానెను గదా! వెంకటయ్యనుండి యతనిని సంరక్షించుటెట్లు? వెంకటయ్య చేయంబూనిన ద్రోహమునకు సాక్ష్యము గని పించుటలేదు. ఏ రీతిగా నతనిని శిక్షింపవలయును?' ఇట్టి విచారణతో సతమతమై తుట్టతుద కెట్లో మనస్సుఁ జిక్కఁ బట్టుకొని యతఁడు కనులు మూసికొనెను.

అంతలో నెవరో తలుపుఁ దట్టిరి. కనులు తెఱువకయే నరసనాయకుఁ 'డెవరు వా'రని ప్రశ్నించెను. 'నేను వెంకటయ్యను. రాయలవారు నిన్నున్న పాటునఁ బిలుచుకొని రమ్మన్నా'రని సమాధానము వచ్చెను. కథ ర_క్తిగట్ట నున్న దని యూహించిన నరసనాయకుఁడు లోనుండియే 'వెంక టయ్యా! ఇంత యర్ధరాత్రమునఁ బ్రభువులకు నాతో నేమి పనియో నీ వెఱుఁగకుందువా? నీవు నాకంటె వయసునఁ బెద్దవాఁడవైనను, ఎంతో యుత్సాహముతోఁ దిరుగుచుందువు. నా శరీరపాటవము తగ్గిపోయినది సుమా! అందును నీ యర్ధ రాత్రమున నిదుర మాని రావలయునన్న నెంత కష్టమో నీ వెఱుఁగవా? నాకు బదులుగాఁ దిమ్మరుసును బిలుచుకొని పొమ్ము. ముదిమివలని దౌర్బల్యముచే నిప్పుడు రాఁజాల నని నా మాటగా సవినయముగాఁ బ్రభువునకు విన్నవింపుము' అని పలికెను.

పాపము! వెంకటయ్య నిరాశోపహతుఁడయ్యెను. తన బెదరింపు లతనికడఁ బనిచేయవని యాతఁ డెఱుఁగును. ఇప్పుడేమి

చేయవలయును ? శత్రు సంహారమునకు నిర్ణీతమైన సుముహూర్తము వ్యర్థము కావలసినదేనా ? కారాదు. కనుకఁ దిమ్మరుసునే వంచించి తీసికొని పోవలయును. ఇరువురిలో నెవఁడు కడతేఱినను మేలే ; జిత్తులమారి తిమ్మరుసు గతించిన వెనుక నమాయకుఁడైన నరసరాజును గడతేర్చుట యొక లెక్కలోనిది కాదని యాలోచించి యఁతడు తన యనుచరులతోఁ దిమ్మరుసునింటికిఁ బోయెను.

వెంకటయ్య వెడలిపోవుట గమనించి, కవచశిరస్త్రాణములు ధరించి, ఖడ్గహస్తుఁడై నరసనాయకుఁ డాతఁ డరిగిన వైపునకే బయలుదేఱెను.

అతఁడు కొంతదూరము పోవునప్పటికి వెంకటయ్య తిరిగి వచ్చుట కాన్పించి ప్రక్కసందులోనికిఁ దప్పుకొనెను. అనుచరులతోఁ గలసి వచ్చు వెంకటయ్య యిట్లనుచుండెను— 'నరసనాయకుఁడే మన వలలోఁ బడలేదు. ఇఁకఁ దిమ్మరుసు చిక్కునా ? మన యిన్నాళ్ల ప్రయత్నము నెందులకును గాకుండఁ బోయినది. ఈ పాటికి విషప్రయోగముచే రాజపుత్త్రుఁడు మరణించి యుండును. ఏ రిద్దఱును గూడఁ గడతేఱినచో మనము కృతార్థులమై యుండెడివారము. గదా !'

నరసనాయకునకుఁ బై మాటలలోఁ గొన్ని వినిపించెను. కొన్ని వినిపింపలేదు. విషప్రయోగమను మాట వినవచ్చెను. వెంకటయ్య విషప్రయోగముచే రాకుమారు నంత మొందించి యుండునని యూహించెను. అప్పు డేమి చేయవలెనో యత

నికిఁ దెలియలేదు. మెల్లఁగాఁ దిమ్మరుసునింటికిఁ బోయెను, తిమ్మరుసు మేలుకొనియే యుండెను. తలుపు తట్టినంతనే 'యెవరువా?'రని ప్రశ్నించి 'నరసనాయకుఁడ'నను సమాధానము విని తిమ్మరుసు తలుపు తెఱచి యతనిని లోని కాహ్వానించెను. గోవిందరాజు మేలుకొనియే యుండెను. నరసనాయకుఁడు లోనికి వచ్చిన పిమ్మటఁ దలుపు గడియవైచి, తిమ్మరు సిట్లనెను—'ప్రభువును మనము సంరక్షింపలేక పోయితిమి. వెంకటయ్య యతనిని దనపొట్టఁ బెట్టుకొనెను. ఈరేయి మనల నిద్దరిని గూడ మట్టుపెట్టవలయునని వచ్చెను. కాని, కృతార్థుఁడు కాలేకపోయెను. ఇప్పుడైనను మఱియొక ప్రమాదము పుట్టకుండ మనము జాగ్రత్తపడవలెను. తత్క్షణమే తగుసేనతోఁ బోయి యంతఃపురమున నేమి జరుగుచున్నదియుఁ బరిశీలింపవలెను. నేను మీ యొద్దకు రావలెననుకొనుచుండగా మీరే వచ్చితిరి.'

నరసనాయకుఁడు తిమ్మరుసు, గోవిందరాజులతోఁ దిన్నఁగా భటాలయమున కరిగెను. అటనుండి నలుదెసలకు భటుల నంపించి, యందందున్న సైనికులనెల్ల రప్పించి, యంతిపురికి బయలుదేఱెను. దూరమందుండఁగనే, యంతఃపురమునఁ గడు సందడిగా నుండుటఁ గనిపెట్టి, నరసనాయకుఁ డొకభటుని బిలిచి, యచ్చటి వృత్తాంత మరసి రమ్మని పంపెను. అతఁడు సత్వరముగా నరిగి తిరిగి వచ్చి యిట్లనెను—'ప్రభూ! త్వరపడవలయును. రాయలవారు మరణశయ్యపై నున్నారు. తిమ్మరుసుమంత్రిగారు దైవప్రసాదమని యొక మధురాహా

రముఁ బంపించినట్లును, దాని నారగించినంతనే శ్రీవారి కిటు వంటి యవస్థ పట్టినట్లును జెప్పుకొనుచున్నారు. వెంకటయ్యగారు ద్రోహులను బట్టి తెత్తునని యరిగి యింతవఱకును రాలేదఁట! వైద్యులు విషప్రయోగమే యని నిర్ధారణ చేసిరి. ఇచ్చట నిత్యము నుండు పరిచారికలలోఁ జాలమంది యీ నాఁడు కానవచ్చుట లేదఁట!' ఆ మాటలు విని నరసనాయకుఁడు తిమ్మరుసుమంత్రివంకఁ జూచి 'ద్రోహి వెంకటయ్య నగరము దాఁటిపోకుండ జాగ్రత్తపడవలయును. రాయలవారి స్థితియు విచారింపవలయును. ఏది ముందు? ఏది వెనుక? నాకేమియుఁ బాలుపోవుట లేదు' అని పలుకఁ దిమ్మరుసు 'ముందుగా రాయలవారిస్థితిని విచారించుటయే చేయవలసిన పని. అంతఃపురమున నెవరెవరు ద్రోహులున్నారో విచారింపవలయును. పలాయితుఁడైన వెంకటయ్య సమాచారమూ పిమ్మటఁ జూచుకొందము' అనెను.

నరసనాయకుఁడు దాని కంగీకరించి, తత్‌క్షణమే క్రొత్తవారు, ప్రాఁతవారు నను విచక్షణలేక యంతిపురిలోని సేవకులందఱను బంధింప ననుజ్ఞ యిచ్చి, పరలోకయాత్రకు సిద్ధపడుచున్న రాయలను సందర్శించెను. ప్రభువును జూచుటతోడనే యతనికి దుఃఖము పొంగిపొరలెను. వైద్యులను జూచి 'యింతేనా మీశక్తి? చిరకాలముగాఁ ప్రభుద్రవ్యముఁ దినుచున్నందులకుఁ గృతజ్ఞత చూపలేరా?' యని ప్రశ్నించెను. వైద్యు లిట్లనిరి— 'అయ్యా! సమయము మించిపోయినది. ఆయుర్వేమాత్ర మున్నను మా మందులకు గుణము

గన్పింపవలసినదే! ఇంతకు నిది మా దౌర్భాగ్యము. రాయల వారి కీ స్థితిలో నుపకరింపలేక పోయితిమి.'

అమాయకుఁడైన సాళ్వరాజిట్లు వెంకటయ్య కుతంత్రమునకు బలియయ్యెను. కాని తిమ్మరుసే విషప్రయోగముఁ జేసెనను నపనింద మాత్రము పుట్టెను. వెంకటయ్యదే యా పాప మనువా రున్నను దిమ్మరుసుపైఁ బుట్టిన నింద నశింప లేదు. ధైర్యహిమాద్రులయిన తిమ్మరుసు, నరసనాయకు లందులకుఁ జలింపక నృసింహభూపతి ద్వితీయకుమారుని సింహాసన మెక్కించి, పాఱిపోయిన వెంకటయ్యజాడలు విచారించుచు, రాజ్యమున నశాంతిని తలయెత్తనీయక పాలనము జరుపసాగిరి.

౪

'మీరేనా వెంకటయ్యగారు ?'

చిత్తము మహాప్రభూ !'

'ఇన్నాళ్లనుండియు మీ రెచ్చట నున్నారు ?'

'సత్త్రిభోజనము, మఠ నిద్రయు నన్నట్లందందుఁ బడి తిరుగుచుంటిని.'

'మీరు చిరకాలమునుండియు నిచట నుద్యోగములో నున్నవారు గదా ! అగతికులవలె నేల తిరుగుచుంటిరి?'

'మహాప్రభూ! దేవరయగ్రజులనే పొట్టఁబెట్టుకొన్న మహామాయావికి నా ప్రాణములుదీయు టెంత పని?'

'మా యన్నను జంపినవాఁడు నన్ను మాత్రము బ్రతుకనిచ్చునా?'

'తప్పక వాఁడెప్పుడో మీకు ముప్పు తెచ్చి పెట్టఁగలఁడు.'

'ఇప్పుడు మీరు మాకే విధముగాఁ దోడ్పడఁగలరు?'

'నేను సమయముఁ జూచి హెచ్చరింతును. అప్పుడు మీరు నేఁ జెప్పినవారిని గడతేర్పవలయును.'

పై సంభాషణవలన నా వ్యక్తులలో మొదటివాఁడు సాళ్వ నరసింహ భూపతి ద్వితీయ పుత్త్రుఁడనియు, రెండవవాఁడు వెంకటయ్య యనియు స్పష్టపడుచున్నది గదా! వెంకటయ్య తుదివాక్యము ముగిసినంతలోనే బయట సలజడి వినవచ్చెను. ప్రభు వా సందడి వినవచ్చునెడకుఁ జూపులు సారించునంతలో నిద్దరు పురుషు లరుదెంచి యతనికి నమస్కరించిరి. వారిని జూడఁగనే వెంకటయ్య పై ప్రాణములు పైకిఁ బోయెను. ఆ వ్యక్తులలో నొకఁడు వానిని గాంచి 'వెంకటయ్యా! వెదుకఁ బోయిన తీగ కాలికిఁ దగులుకొన్నట్లు ప్రత్యక్షమయితివి. నేఁటితో నీ పాపములు పండినవి లే'' యని ద్వారమువైపు దృష్టి ప్రసరింపఁజేసెను. ఉత్తరక్షణములో యమకింకరుల వంటి రాజభటులు వచ్చి వెంకటయ్యను బంధించి యీడ్చుకొని పోయిరి. పిమ్మట నతఁడు రాజును జూచి యిట్లనెను.

'ప్రభువుల కేటువంటి యల్పులతో నెయ్యము తగదని విన్నవించుకొని యుంటిమి. కాని మా మాటలు గాలికిఁ బోయినవి. ఇట్టి క్షుద్రులపొత్తు మఱి కలుగకుండఁ జూచుట మా విధి. తమకుఁ బెనుగొండలో సురక్షితస్థల మొకటి యమరించి యుంటిమి. అందుండి హాయిగాఁ గాలము గడుపుదురు గాక !'

పిమ్మట వారు వెడలిపోయిరి, సాళువ రాజపుత్త్రుఁడు చింతాక్రాంతుఁ డయ్యెను.

ఆ యిద్దఱు పురుషులు తిమ్మరుసు, నరసనాయకులని వేఱుగాఁ జెప్పనక్కఱ లేదు. మఱునాఁడే రాజు పెనుగొండకుఁ బంపబడెను. నరసనాయకుఁడు రాజప్రతినిధిగాఁ, దిమ్మరుసు ప్రధానిగాఁ బరిపాలన మారంభమయ్యెను. వెంకటయ్య బహిరంగముగా నురితీయఁబడుటతో రాజద్రోహు లంతరించిరి. శత్రురాజులు విద్యానగరమువైపు తేఱి చూడఁజాలరైరి. తిమ్మరుసుపేరు వారికి సింహస్వప్నమయ్యెను. సాళ్వ నృసింహ రాయలకు వశ్యులు కాని సామంతులెందఱో తుళువ నరసింహ రాయలకు వశ్యులైరి. రాజప్రతినిధి యన్న మాటయే మఱచి ప్రజలందఱు నరసనాయకునే ప్రభువుగా భావింపఁజొచ్చిరి. ఇట్లు రెండు మూఁడేండ్లు గడచెను.

నరసనాయకునికి ముగ్గురు భార్యలు. తిప్పాంబ, నాగాంబ, ఓబాంబ యని వారి నామములు. తిప్పాంబకు వీరనరసింహ రాయలు, నాగాంబకు శ్రీకృష్ణదేవరాయలు, ఓబాంబకు అచ్యుతదేవరాయలు, శ్రీరంగరాయలు నను పుత్త్రులు

కలిగిరి. వారు క్రమముగాఁ బదునాలు, పండ్రెండు, పది, ఎన్మిదేండ్ల వారైనారు. వీరనరసింహుఁడు నిజముగా నా పేరికి దగినవాఁడు. ఆజానుబాహువు; వ్యాయామ కర్కశ శరీరుఁడు; సముద్ర గంభీరుఁడు. నరసనాకుఁ డతనియందుఁ దన ప్రతిబింబముఁ జూచి మైమఱచును. ఆ వయస్సుననే యతఁడు తండ్రితో రణరంగమున కరిగి మెచ్చుటఁజూచినఁ దానయై పోరు నడుపుచుండెను. శ్రీకృష్ణదేవరాయ లన్న గారివలె నంత పొడుగరి కాఁడు; పొట్టివాఁడును గాఁడు; ఐదున్నర యడుగుల యెత్తు గలిగి, చామనచాయతో నలనాఁటి కృష్ణుని దలఁపించు నతని నందఱును కృష్ణుఁడనియే వాకొనుచుండిరి. ఆ కృష్ణునివలెనే యీ కృష్ణుఁడును జగన్మోహనుఁడు. ఆప్తులకు సుధాంశుఁడు, శత్రువులకుఁ జండాంశుఁడునైన యతనిలో సౌమ్యతీవ్రతలు రెండును వియ్యమందుకొన్నవి. వీరనరసింహునికి వీరకార్యములందుఁ గల మక్కువ యితర విషయములందు లేదు. కృష్ణరాయఁడు వీరుఁడే గాక, విద్యాప్రియుఁడు; లలితకళలయం దభిమానము మెండుగాఁ గలవాఁడు. బాల్యముననే యతఁడు చిటిపొటి పద్దెము లల్లఁజొచ్చెను. సంస్కృతాంధ్రములు రెంటను సవ్యసాచివలె గంటముఁ బర్వెత్తించుచుండెను. నరసనాయకుఁ డతనిని మిక్కిలి ప్రేమతోఁ జూచును. మూఁడవవాఁడగు నచ్యుత రాయలును గుణసంపన్నుఁడే; కాని పరమసాధువు. శ్రీరంగ రాయల గుణము లిట్టివని నిర్ణయించుటకు వీలులేదు. నరస నాయకుఁ డపుడపుడు తిమ్మరుసుతో నిట్లనుచుండును—'నా తీవ్రత యంతయుఁ బెద్దవానిలో నొదిఁగినది. బుద్ధివైశద్యము,

ప్రతాపము కృష్ణునిలోఁ. బండినవి సౌమనస్య మచ్యుతునిలోఁ గుదురుకొన్నది. జాడ్యము నాల్గవవానిలోఁ గుదిరినది. తిమ్మరుసూ! తండ్రు లందఱికిఁ బెద్దకొడుకుపైఁ బ్రేమ యెక్కుడని పెద్దలందరు ; కాని నా కీ ద్వితీయునిమీఁదనే విశేషాభిమాన ముండునేమి ? అట్లని పెద్దవానిని బ్రేమించుట లేదని కాదు. ఆ యతితీవ్రతచే నేమి యకార్యమునకుఁ దెగించునో యని వానిని దలఁచుకొని జాలిపడుచుందును. సాళ్వచక్రవర్తి కుమారులకును నా కుమారులకును బోలిక లేదు.'

తిమ్మరు సిట్లు జవాబిచ్చెను. 'మహారాజా! ద్వితీయుఁడద్వితీయుఁడు. మిగిలినవారిలో రాజలక్షణములు లేకపోలేదు కాని యితనిలోఁ గనఁబడునవి సార్వభౌమ లక్షణములు ; నేను నిజము చెప్పుచున్నాను. కృష్ణరాయలలోని శక్తిసామర్థ్యములు తక్కిన మీ కుమారులలోనే కాదు, మీలోఁ గూడ లేవు.' నరసనాయకుఁ డా మాటలు విని నవ్వి'' కానీ వయ్యా ? 'పుత్త్రాదిచ్ఛేత్పరాజయ'మ్మను సూక్తి యెఱుఁగము గనుకనా! సర్వవిధముల వాఁ డంతటివాఁడు కావలెననియే నా సంకల్పమును.'

తుళువ రాజకుమారులను జూచిన ప్రజలు సాళ్వరాజకుమారులను మఱచిపోయిరి. పైపెచ్చుగా నెవరైన నా ప్రసంగ మెత్తినచో 'వీరెక్కడ ? సాళ్వరాజు కుమారులెక్కడ ? ఇరువురికి హస్తిమశకాంతర మున్నది. భగవంతుఁడు విద్యానగరమును మఱికొంత కాలము నిలుపఁదలచి

నాఁడు; కలకాల మీా వంశమువారే మనల నేలుదురుగాక!' యనుచుండిరి.

కృష్ణరాయలకుఁ దిమ్మరుసుచెంతఁ జన వెక్కువ. తిమ్మరుసునకును నతనియందు వాత్సల్యము హెచ్చు. ఆ మంత్రి యతనిచే భారతము సవ్యాఖ్యానముగఁ జదివించెను. సకల ధర్మములను సాంగోపాంగముగా నెఱిఁగించెను. ఆ సమయములందా బాలుఁడు కేవలము యుధిష్ఠిరునివలెఁ గానఁబడును. 'అహో! ధర్మజుని పుణ్యశీలము! అప్పాజీ! అడుగడుగున నింత విమర్శతో జీవితము నడుపుకొనువాఁ డింకొకఁ డున్నాఁడా? ధర్మనిర్వాహణమే లక్ష్యము గాని, తదితర మతనికిఁ గిట్టదు. చేసికొన్న భార్య, తోడఁబుట్టిన తమ్ములు, కూర్మిబందుగులు, మిత్రములు నెంత గీపెట్టినను సమయ వైరుధ్యమునకు సాహసింపఁడే! శత్రువైన దుర్యోధనునియందును నతనికి జాలియేనా? కనుకనే యతఁ డజాత శత్రువైనాఁడు!' అని యాతఁ డనును.

తిమ్మరు సిట్లు ప్రత్యుత్తరమిచ్చును— 'బాబూ! అవసరమైనచోట నతఁడు కాఠిన్యమును గూడఁ బ్రదర్శించె ననుట మఱవకుము. శల్యు నతడే వధించినాఁడు; ద్వైపాయన హ్రదమున దాఁగిన సుయోధను నీవలకుఁ బిలిపించి కూల్పించినాఁడు. మహాపురుషుల హృదయములు ప్రకృతి కోమలములైనను, దుష్టశిక్షణము వలసినపుడు పాషాణకఠినము లగును. ముద్రారాక్షసముఁ జదివితివి గదా! అందుఁ జాణక్యునిగుఱించి నీ యభిప్రాయమేమి?'

కృష్ణరాయఁడు నవ్వుచు నిట్లనును— 'మాకుఁ జాణక్యులవారు నిత్యసన్నిహితులై యుండఁగా, గ్రంథస్థ చాణక్యునిగుఱించి విచారింపవలసినంత యవసరమేమి ?'

తిమ్మరుసు మెల్లఁగా నిట్లు పలుకును— 'నీకు నాయందు విపరీతమైన గౌరవ ముండుటచే నట్లందువు గాని చాణక్యుని ప్రతిభయందు శతాంశమైన నాలో లేదు. అట్టి ప్రతిభయే యున్న వెంకటయ్యచేతిలో సాళ్వరాజ పుత్త్రునికి మరణము కలుగ నిత్తునా ? చాణక్యప్రజ్ఞ నాలో లేకున్నను, చంద్రగుప్తుని యదృష్ట విశేషము నీ కబ్బినచోఁ జాలును. నీవలన నాకుఁ బ్రసిద్ధి యేర్పడఁగలదు.'

ఇట్టి ప్రసంగములతోఁ గృష్ణరాయనికిఁ జంద్రగుప్తుని వలె దేశము నుద్ధరింపవలయునను కుతూహలము గాఢ మయ్యెను. దానికిఁదోడు ప్రాచీనభారత సంస్కృతిని సముద్ధ రించి తీరవలయునను కోరికయు బలమయ్యెను. తనయందుఁ దిమ్మరుసునకుఁగల వాత్సల్యము నెట్లు సార్థక మొనర్చుకొన వలెనను జిజ్ఞాసకూడఁ బుట్టెను. ఇవన్నియు సాధించుటకుఁ దాను సామర్థ్యము సంపాదింపవలయునను కాంక్ష యతనికి విస్తార మయ్యెను.

కృష్ణరాయనికిఁ బదునాఱేండ్లు నిండెను. అప్పటికి సమస్తాయుధ కౌశలము, వ్యూహనిర్మాణము, తద్విభేదనము, దుర్గ రక్షణము, తదాక్రమణము మున్నగాఁ గల యుద్ధ విద్య లన్నిటియందు నతఁడు నేర్పు గడించెను. గుఱ్ఱపుస్వారి కత్తిసాములలోఁ దనయంతటివాఁడు లేఁడనిపించుకొనెను.

నాహ్వానించి 'యేమి నాయనా! కవులందఱు ఘనదర్శనముఁ జాతకములు వోలె నీ సందర్శన మభిలషించుచుందురు. ఇప్పు డిటు వచ్చితివేమి?' అని ప్రశ్నించెను. రాజకుమారుఁ డతనికిఁ బ్రత్యుత్తర మీయనున్నంతలో రాజభటుఁ డొకఁడు వచ్చి యిర్వురికి నమస్కరించి నిలిచెను. తిమ్మరుసు వానిని జూచి 'ఏమోయీ! నిన్ను నేనెప్పుడుఁ జూచియుండలేదే? నీవు కొలువులోఁ బ్రవేశించి యెన్నాళ్లయినది? ఇపు డే పనికై యిట్లు వచ్చితివి?' అని యడిగెను. వాఁడొక వెడ నవ్వు నవ్వి యిట్లనెను. 'అయ్యగారు నన్నే గుర్తుపట్టుట లేదా? పెద్దమ్మగారి పుట్టినింటినుండి వచ్చినవాఁడను; చాల మాఱులు మిమ్ము సందర్శించితిని. అమ్మగారు చిన్న బాబుగారికొఱకు నిరీక్షించుచున్నారు. కుమారులందఱు పంక్తి నున్నఁగాని భుజింపరఁట!'

తిమ్మరుసున కేలకో వాని వాలక మనుమానముఁ గలిగించెను. కాని యేమియుఁ జెప్పుట కవకాశములేక రాజకుమారు నీవలకుఁ బిలిచి, 'భద్ర'మని హెచ్చరించి వీడు కొలిపెను.

పిమ్మట నొక దాసిని బిలిచి, మంత్రి యిట్లనెను. 'చతురికా! నీకుఁ దిప్పాంబాదేవియొద్దఁ బని వున్నదిగదా! అచటి కేఁగి యప్రమత్తవై సర్వముఁ గనిపెట్టి యుండుము. అనుమాన మేమైనఁ దోఁచినచో నాకుఁ దెలుపవలెను.'

చతురిక వినయముతో నతనికి నమస్కరించి పెద్ద రాణిగారి యంతఃపురమున కరిగెను.

తిప్పాంబకౌటిల్యము స్పష్టాస్పష్టముగ నెఱిఁగియున్న ప్రధాని దాసి యే సమాచారముఁ దెచ్చునోయని కలఁత పడుచునే పండితులతోఁ బ్రసంగించుచుండెను. పండితులు భాగీరథి యవతరణ గాథ నెత్తుకొని సగరోత్పత్తి విషయమై ముచ్చటించుచుండిరి. తల్లి గర్భమం దుండఁగనే సవతి తల్లులు సగరునికి విషముఁ బెట్టించుటయే యా ప్రసంగమునఁ దోలియంశ మయ్యెను. 'వీ రీ విషయమే ముందుగా గ్రహింప నేల? తిప్పాంబ తలపెట్టిన దురుద్యమము నీశ్వరుఁడు వీరి వాక్కులలో సూచించుచున్నాఁడా!' యని తిమ్మరుసు శంకాకులుఁ డయ్యెను. అయినను సహజగాంభీర్యమున మనసులోని కలవరమును నిగ్రహించుకొని యథోచితముగా వారితో సంభాషణము నెఱపుచుండెను.

అంతలో మహారాజు దగ్గఱనుండి పరిచారకుఁ డొకఁడు వచ్చి విద్వాంసుల గోష్ఠిలోఁ బాల్గొనుటకుఁ బ్రభువులు కుతూహలపడుచున్నారనియు, వీర విద్యాప్రదర్శన మప్పటికే యారంభమయ్యెననియు విన్నవించెను. ప్రధాని విద్వాంసుల నాస్థానమునకు బయలుదేరుఁడని హెచ్చరించి, వారిని వీడ్కొల్పెను. అంతిపురినుండి దాసి మఱలి రానందులకు శంకించుచు, తప్పని సరి యగుటచేఁ దిమ్మరుసు కొలువు కూటమున కరుగనుండెను. ఆ సమయముననే చతురిక ససంభ్రమముగా వచ్చి యిట్లు విన్నవించెను —'యువరాజుగారు శస్త్ర విద్యా ప్రదర్శనముఁ దిలకింప వెడలినారు. కృష్ణరాయలవారిని మాత్రము తిప్పాంబాదేవి యేదో ప్రసంగములో దింపి

యున్నది. పరిచారిక లే హేతువుననో యందందు గుజగుజలు వోవుచున్నారు. 'ప్రసాదము – విషమిశ్రితము...తరుణము' అను పలుకులు కొన్ని సందర్భవిరహితముగ వినఁబడినవి. మొత్తముమీఁదఁ బెద్దరాణిగా రొక ఘోరకృత్యముఁ దలపెట్టినట్లే నా కనుమానము కల్గుచున్నది.'

ప్రధాని కొంచె మాలోచించి, యేదో నిశ్చయించుకొని దాసికి సెల విచ్చి సత్వరముగా నంతిపురి కరిగెను. ఆ సమయముననే 'నాయనా! పంపాపతి ప్రసాదము. స్వీకరింపు' మని తిప్పాంబాదేవి కృష్ణరాయలకుఁ గొన్ని భక్ష్యము లొసఁగెను. అతఁడు వానిని గ్రహించి కన్నుల కద్దుకొనుచుండఁగా సేవకుఁడు వచ్చి 'మహామంత్రులు దర్శన మపేక్షించుచున్నా' రని తిప్పాంబాదేవికి విన్నవించెను. దేవి కొండ విరిగి మీఁదఁబడినట్లు కంపించెను. ఆమె యే సమాధానమును జెప్పకముందే కృష్ణరాయలు చివాలున లేచి తిమ్మరుసున్న యెడకుఁ బోయెను. రాణి చేయునది లేక మంత్రిరాక కనుమతి నొసఁగెను.

కృష్ణరాయలను వెంటఁబెట్టుకొని ప్రధాని మహారాజ్ఞినిసందర్శించి సవినయముగా నిట్లనెను—'కవు లనేకులు వీరినిమిత్త మెదురుచూచుచున్నారు. విద్వద్గోష్ఠి ప్రారంభము కానున్నది. యువరాయలవారు వీరకుమారులను బరీక్షించుచున్నారు. నిర్ణీతకాలమున కా యా కార్యములు ప్రారంభింపఁబడనిచో వేడుకలన్నియు సాగవని దేవిగా

రెఱుఁగనివారు కారు. అనుమతి నిచ్చిన-చో వీరిని వెంటఁ బెట్టుకొని పోయెదను.'

తిప్పాంబాదేవి తెచ్చికోలు నవ్వుతో మంత్రిని జూచి మెల్లఁగా 'చిరంజీవుల యభ్యుదయ మాకాంక్షించి పంపాపతీ సమర్చన గావించితిమి. స్వామిప్రసాదము కుఱ్ఱవాఁ డారగించులోనే మీరు వచ్చితిరి. మహామంత్రీ! మీ మాట ప్రభువులే కాదనలేరు. ఇఁక మేమెంత? అట్లే తీసికొని పోవచ్చును' అని కృష్ణరాయలతో 'కుమారా! ఆ ప్రసాద మిటు తే; తరువాత వచ్చి యన్నతోఁ గలసి యారగింతువు గాని!' అని పలికెను.

మంత్రి కామె పలుకులలో భీతి యొకటి గోచర మయ్యెను. దాసి చెప్పిన పలుకులు యథార్థములని తోఁచెను. వెంటనే యతఁడు నవ్వుచు 'దేవిగారు మమ్ము మన్నింపవలెను. స్వామి యాలయమునుండి యీ ప్రసాదముఁ గొనివచ్చిన వారిని నే నొకసారి చూడఁగోరెదను. ఆ వ్యక్తులను గాంచి మఱలిపోయెదను' అని పలికెను.

రాణి యాతనిపలుకులకుఁ గలవరపడుచు 'అట్లందురేల? దీని విషయమై మీ కేమైన ననుమానమున్నదా? రాజో ద్యోగులకుఁ బ్రపంచ మంతయు ననుమానాస్పదముగాఁ దోఁచును గాఁబోలు! పోనిండు. ఆ ప్రసాద మావలఁ బాఱ వేయుదును. నాయనా! ఆ భక్ష్యము లిటు తెమ్మని కృష్ణ రాయలచేతిలోని భక్ష్యము లందుకొని యావలఁ బాఱ వైచెను. ఆ చర్యకుఁ దిమ్మరుసునను మానము మఱింత బల

పడెను. ఆ భక్ష్యములు పడినవైపతఁ డాశ్చర్యముతోఁ జూచుచుండెను. రెండు కుక్కలా ప్రసాదమునకై కలహించి చిక్కినంత భక్షించి కనులు తేలవైచి నేల కొరిగెను. అతఁ డా దృశ్యము మహారాజ్ఞికిఁ జూపి యిట్లనెను. 'అమ్మా! ఆశ్వానముల యవస్థఁ జూచుఁడు! ప్రసాదమహిమ యెంతటిదో స్పష్టమైనదిగదా! జయకారకుని ప్రసాదము లయకారకమే యగుచున్నదే! తల్లీ! నేను శిక్ష నాలసించిన నీ రాజపుత్రునికిఁ గూడ నీ గతియే పట్టి యుండును గదా! ఇతఁడు 'మీ యెడల విధేయుఁడే కాని యవినీతుఁడు కాఁడే! ఏ ప్రారబ్ధమున నితని కింత శిక్ష విధింపఁదలపెట్టితిరి?'

తిప్పాంబాదేవి నిలుచున్నచోటనే కొయ్యబారి పోయెను. ప్రధాని యింకేమియుఁ బలుకక రాజపుత్రుని దీసికొని యంతఃపురము వాసి పోయెను.

౨౩

మనోజ్ఞమగు నొక యుషస్సమయమునందు విద్యానగరపుఁ గోటగోడల మీఁద యువకుఁ డొకఁడు రెండు చేతుల సందుల రెండు లోహగోళము లిఱికించుకొని దూసిన బాణమువలెఁ బరుగు లిడుచుండెను. కాల్యములు తీర్పఁ జను పౌరు లాతనిని నిర్నిమేషనయనులై వీక్షించుచుండిరి. 'యువరాజు! యువరాజు! అంత యెత్తగు గోడలపై నెక్కి క్రిందికిఁ జూచిననే కన్నులు తిరుగునే! నిర్భయముగా నెట్లు పరుగిడుచున్నాఁడో! ఊరక పర్విడుటయే కాదు. రెండు

చేతులలో రెండాయసగోళములు! ఒక్క-గోళము భుజమునఁ బెట్టుకొని పదిబారలు పోలేము. అంత బరువుతో నంతయనాయాసముగాఁ బరుగిడుట యెవనికి సాధ్యము? భారతమునాఁటి భీముఁడు తిరిగి యిట్లు పుట్టెనుగదా!' యని వా రొకరితో నొకరు చెప్పుకొనుచుండిరి.

ఇంతలో నా కుమారుఁ డా వేళకా పరిశ్రమ ముగింపఁ దలఁచి కాఁబోలు! పరుగు చాలించి క్రిందికి దిగి వచ్చెను. అతని కెదురుగా నఱువది యేండ్ల వయస్సు గల యొకవ్యక్తి వచ్చుచుండెను. ఆ మహాపురుషుఁడు పచ్చని దబ్బపండువంటి మేనిచాయవాఁడు. అయినను నిరంతర దేహపరిశ్రమవలననో యేమో, పటుత్వ మీషత్తయిన సడలినట్లు కనఁబడుట లేదు. అతని కన్నులు సువిశాలములయి తేజస్సు గ్రక్కు-చుఁ జూపుతో నెదుటి వారిని లోఁగొనఁగలిగిన శక్తిని వెలార్చుచుండెను. ప్రజ లాతనిఁ గాంచినంతనే వినయవినమితులై తమ కతని యందుఁ గల గౌరవాతిశయముఁ బ్రకటించుచుండిరి.

మన యువకుఁ డతనిని జూచినంతనే "అప్పాజీ! నమస్కారము" అనెను. అతఁడు చిఱునవ్వుతో నా వందన మంగీకరించి 'చిరంజీవ వత్స!' యని యాశీర్వదించెను.

యువ :—అప్పాజీ! మనము గజపతిపైకిఁ బోవు టెప్పుడు?

అప్పాజీ :—నాయనా! దీనికై నీ కింత యారాటమేల? అన్నగారున్నారు కదా! విజయము తటస్థించినచో రాజ్యలాభము వారికేఁగాని, నీకుఁ గాదు గదా!

యువ :—అన్నగారి లాభము నా లాభము కాదా ?

అప్పాజీ :—వెఱ్ఱివాఁడా! నీ వన్నగారియెడల లక్ష్మణుఁడవే కాని...........

యువ :—ఆఁ! 'కాని' యనుచున్నారేమి ?

అప్పాజీ :—నీ భ్రాతృభక్తి కొనియాడఁదగినది. రా! మాటలాడవలసిన విషయము లెన్నో యున్నవి.

అని పలికి యప్పాజీ యా యువకుని వెంటఁబెట్టుకొని యొక యేకాంతస్థలమునకుఁ బోయెను. గుప్తముగా నున్న యొక పత్ర మతనికిఁ జదువుకొన నిచ్చెను. అం దిట్లుండెను.

'ప్రధానులగు తిమ్మరుసుగారికి విద్యానగ రేశ్వరులు వీర నృసింహారాయల యాజ్ఞ యే మనఁగా— ఈ జాబు చూచిన వెంటనే రాజద్రోహి కృష్ణరాయల కన్నులు పెఱికి తెచ్చి మాకుఁ జూపవలయును.

వీరనరసింహారాయలు'

యువకుఁ డా జాబుఁ జదువుకొన్నంతనే యతని ముఖమందలి ప్రసన్నత యదృశ్య మయ్యెను. కనులు బాష్పాకులితము లయ్యెను. కంఠము రుద్ధమయ్యెను. కొంతవడికి స్థైర్యముఁ జిక్కఁబట్టుకొని యతఁ డిట్లనెను.

'అప్పాజీ! నేను రాజద్రోహినా ? అన్నగారి కిట్టి యభిప్రాయము కలుగుటకుఁ గారణమేమి ? ప్రమత్తుఁడనై యెపుడైన వారియాజ్ఞఁ దిరస్కరించితినా ? వారస్వస్థులై యున్నం

దులకుఁ బరితపించుచుఁ, ద్వరలో వారికి సంపూర్ణారోగ్యముఁ గూర్పుమని విరూపాక్షస్వామిని వేఁడుకొనుచుంటినే! వారికి నాపై నిట్టి భావము కలుగుటకుఁ గారణమేమి ?'

అప్పాజీ :—తండ్రీ! నీ హృదయమును నే నెఱుంగుదును; కాని రాజులు తమ నీడనైన విశ్వసింపఁజాలరు. నీ సాహస ములు వారికి భయావహములుగ నున్నవి. ప్రజలకు నీయందుఁ గలుగుచున్న యభిమానము వారి కీర్ష్యాకారణ మైనది. తిరుమలరాయలవారికి సింహాసనమును నీవు దక్కనీయవను భయ మాయనకుఁ గల్గినది.

యువ :—ఇది నిజమా? నా యన్న కొడుకు నా కొడుకు కాఁడా? దేశ మెవ రేలిన నేమి? కావలసినది సుపరిపాలనమే కదా!

అప్పాజీ:—నీవు భోజమహారాజుచరిత్ర నెఱిఁగి యున్నావు కదా! అతని పినతండ్రి ముంజుఁ డేమి చేసెనో జ్ఞప్తిలో నున్నదా!

యువ :—నేను ముంజునివలెఁ బ్రవర్తింతునా అప్పాజీ! అన్నగారికి నాపై నిటువంటి యనుమానమే కలిగినప్పుడు నేను బ్రదికి యేమి లాభము? తత్క్షణమే వారి యాజ్ఞ నిర్వర్తింపుఁడు.

అప్పాజీ :—కుమారా! విషాదమువలనఁ బ్రయోజనము లేదు. చక్కఁగా విచారించి కర్తవ్యమును నిర్ణయింపుము.

యువ :—అప్పాజీ! ఒకనాఁడు సవతితల్లి చేయఁబూనిన విష ప్రయోగమునుండి నన్నుఁ గాపాడితిరి. నాఁడే యను కొంటిని, నా ప్రాణములు తిమ్మరుసుగారివే కాని నావికావని. కనుకఁ గర్తవ్య నిర్ణయము మీదే కాని నాది కాదు.

అప్పాజీ :—బాబూ! నాఁటి పరిస్థితు లిటువంటివి కావు. అప్పుడు జరుగు కుతంత్రము లరికట్టుట నా విధి. ఆ మహా రాజు గతించుచు నీ పాపభారము నాకు వదలిపెట్టినాఁడు. ఆయనతో నేనును గతించి యుంటినేని యిట్టి దారుణములు చూచెడివాఁడను గాను.

యువ:—ఇఁకఁ గాలయాపన మెందులకు? రాజాజ్ఞ మీకె ట్లభిలంఘనీయమో నాకును నంతే! క్షణ మాఁగుడు. నేనే స్వయముగా నా నేత్రములను బెకలించి యిత్తును.

అని పలికి యతఁడు కటిబద్ధమగు బాకు నీవలకుఁ దీసి యప్పాజీకిఁ దుదివందన మర్పించి, యొక్కమా రాయన మొగ ముఁ బరిశీలించి, పిమ్మట బాకు కొన దక్షిణాక్షిని జేర్చెను. అతని ధైర్య స్థైర్యములకు విస్మితుఁడైన ప్రధాని తత్క్షణమే యా బాకుఁ దీసికొని, దూరముగాఁ బడవైచి యా యువ కునిఁ గౌఁగిలించుకొని, శిరము మూర్కొని యిట్లనెను.

'కృష్ణరాయా! విక్రమార్కుని సాహసమును కథ లలోఁ జదివితిని. నీ సాహసముఁ గన్నారఁ జూచితిని. ఇట్టి మణిపూసను నిన్నుఁ గోల్పోఁగలనా? ఈ యాజ్ఞ విన్నచో నీ

వెట్లు ప్రవర్తింతువో చూడఁగోరి యింత తడవు పరీక్షించితిని. బాబూ! నీవే నేను; నేనే నీవు. నిన్ను రక్షించుకొనలేక పోయినపిమ్మట నేను జీవించిననేమి? చచ్చిననేమి? తుంగ భద్రాతీరమునకుఁ బోవుదము రమ్ము. అందొక భూగృహము నీజనకునినాఁడు నిర్మించితిమి. అది నీకు సురక్షిత ప్రదేశము కాఁగలదు.'

పిదపఁ గృష్ణరాయలను వెంట నిడికొని ప్రధాని యొక యశ్వశకట మెక్కి పురము దాఁటి యఁట నదీతీరము నకు దవ్వుగా నున్న యొక భూగృహముఁ బ్రవేశించెను. కృష్ణ రాయ లా గృహముఁజూచి యచ్చెరువడి 'అప్పాజీ! భూగృహమన్న పేరేగాని యిది సర్వసౌకర్యములతో రాజ మందిరమువలెనే యున్నదేమి? దీనిని గట్టించుటలో మీ యభిప్రాయమేమి?' యని ప్రశ్నించెను. అమాత్యుఁ డతని ప్రశ్ననాలించి యిట్లనెను. 'వత్సా! ఈ గృహమునకుఁగల మార్గముఁ జూచితివికదా! కంటక నిబిడమైన పొదల నడుమ నటువంటి సొరంగముండునని యెవ్వరు నూహింపఁజాలరు. ఈ భూగృహమున కావల నొక బిల మున్నది. ఆ బిలముఖ మున నొక పెద్ద యంగడి కలదు. నా మిత్రుఁడొకఁడా యంగడి కధికారి. అందుండి యిట కవసరమైనపు డాహార పదార్థ ములు తెప్పించుకొనవచ్చును. వందమంది నివసించుట కను వుగా నీ మందిరము నిర్మింపఁబడినది. శత్రువులు విద్యానగర మును ముట్టడించినయెడల విజయ మసాధ్య మనుకొన్న ప్పుడు ప్రభువు లీ మందిరము నుపయోగించుకొనవచ్చును.

దీనిప్రయోజన మిది. నేఁటినుండి నీ విట వసింపుము. నీకు వలయు పరిజనమును నేను నిర్ణయించి పంపుదును. మఱల నా హెచ్చరిక వచ్చువఱకు నీ వీ మందిరము విడిచి రారాదు. భద్రము. ఇఁక నేఁ బోయి వచ్చెదను.'

కృష్ణరాయలు కృతజ్ఞతా సంతోష సంభ్రమములు ముప్పిరిగొనఁగా నతనిని గాంచి 'తండ్రీ! మీ యాజ్ఞ యేనాఁడు కాదంటిని ? సేవకులతోఁగూడ తెలుఁగుభారతమును, ఒక గంటమును, కొన్ని తాళపత్రములను పంపుఁడు. అవకాశము న్నచో నా మందిరమందుఁ గల ద్రవిడ ప్రబంధములను గూడఁ బంపఁగోరెదను. విముక్తిపర్యంతము భారతీ సపర్యతోఁ గాలము గడుపుదును' అనెను. ఆ కోరికకుఁ బ్రహృష్టుఁడై తిమ్మరుసు 'వత్సా! చక్కని కోరిక కోరితివి. నీ వడిగినవే కాక నాకుఁ దోఁచినవియుఁ గొన్ని గ్రంథము లంపుదును. నిశ్చింతుఁడవయి యుండుము' అని యతనిని గాఢముగా నెదకు హత్తుకొని విడువఁజాలక విడువఁజాలక విడిచి వెనుకకుఁ దిరిగెను.

అట్లు కృష్ణరాయనిఁ బాతాళ గృహమున డించి, మహామాత్యుఁడు పురాభిముఖుఁడై తనలో నిట్లు వితర్కించు కొనుచుండెను—'మహానుభావుఁడు చిట్టి గంగనామాత్యుఁడు నాపై నొక మహాభారము పెట్టి యరిగినాఁడు. ఈ బాధ్యత నానాఁటికి నా కంఠమునకుఁ గాలపాశమై బిగియుచున్నది. సాళ్వరాజపుత్రు లట్లు వివేకశూన్యులై చెడిరి. తుళువరాజ కుమారులు గుణవత్తరులని మురిసితిని. నిందు జాబిల్లిలోని

కలంకమువలె వీరనృసింహున కవసానదశలో నీ దుర్బుద్ధి పుట్టినది. తేజోనిధి కృష్ణరాయని రక్షించుట యెట్లు? నగరముఁ జేరఁగనే 'రాజద్రోహిని శిక్షించితివా? వాని కన్నులు పెటికిఁ దెచ్చితివా?' యని వీరనృసింహుఁ డడుగక పోఁడు. అతని కేమి సమాధానముఁ జెప్పుదును?'

ఆ చివరి ప్రశ్నకు జబాబాతనికి స్ఫురింపలేదు. జలజాయతములగు కృష్ణరాయని యాకర్ణాంత నేత్రములు మనస్సునందు దృశ్యమానములగుచుండెను. వెన్నెలలు విరఁజిమ్ముచు నడుమ నింద్రనీలద్యుతులు గ్రక్కు తారకలను, నెఱుపు జీరలువాఱు నేత్రాంతములను దలపోసి 'సార్వభౌమ చిహ్నములై దక్షిణాపథమునకంతకుఁ జలువలు గ్రుమ్మరించు నా కందోయిసాటి యేది?' యని విచారము వొడమెను. ఆ విచారముతోనే యతఁడు నగరపుఁబొలిమేర డాసెను.

ఆకస్మికముగా నతనిదృష్టి యొక ప్రక్కేవఁ బ్రసరించెను. కటికవాండ్రు కొందఱటఁ గొన్ని మేఁకలను వధించుచుండిరి. అందొక యజపోతము పరిదీననేత్రమై దిక్కులరయుచుండెను. దానిని జూడఁగనే యమాత్యున కమితమైన జాలి పుట్టెను. దానిని వధింపవలదని యతఁడు వారిని వారింపఁగోరెను. కాని వారు కొంత దవ్వున నుండుటవలనఁ గేకవైచినను నందునట్లు తోఁచలేదు. అతఁడు హుటాహుటిగా నటు నడచుచు 'ఆఁగుఁడాఁగుఁ' డని యుచ్చైస్స్వరమున నఱచెను. ఆ కటికవాండ్రతనిని జూడనేలేదు. అతని హెచ్చరిక వీనులఁ బడకముందే వా రా యజశిశువుతల ఖండించి వైచిరి.

జాలిచేఁ గళవళించుచు నా శిరస్సునే చూచుచున్న తిమ్మరుసునకుఁ దటాలున నొక యూహ స్ఫురించెను. ఆ మేఁక కన్నులే కృష్ణరాయల కన్నులని వీరనృసింహునికిఁ జూప రాదా ? అట్టితలఁపు కలుగఁగనే తిన్నఁగా నతఁ డా చోటికిఁ బోయెను. వధ ముగించిన కటికవాండ్రు స్తిమితచిత్తులై యుండుటఁ జేసి యమాత్యునిరాక గమనించిరి. తత్తఱపాటు, సిగ్గు పెనఁగొనుచుండ వా రాయనకు నమస్కరించి తలలు వంచుకొని నిలిచిరి. మంత్రి వారినిఁ జూచి 'ఈ మేఁక పిల్లను మీరు వధింపక ముందే వచ్చి దీనిప్రాణములు కాపాడ వలె ననుకొంటిని. కాని కార్యము మించిపోయినది. మించిన దాని కేమి చేయవచ్చును? దీనిపై నొక మమత నాకేర్పడినది. దీనికన్నులు భద్రముగాఁ దీసి యీయఁగలరా ?' యనెను.

'మేఁకమీఁద మమతయా ? అది చచ్చినదే! కాని కన్నులైనఁ గావలయునా ? మహామంత్రి యిట్లడుగునేమి ? ఏమో! వీని మూలమున నాయన యే మహాకార్యము సేయునో!' యని తలంచుచు వా రాయనకోరికను నెఱవేర్చిరి. అమాత్యుఁడు వారిలో నొక వృద్ధుని దగ్గఱకుఁబిలిచి 'ఓయీ! ఈ మేఁక కన్నులు దీసికొని నాతో రాఁగలవా ? మహారాజున కివి సమర్పించి తిరిగి రావచ్చు' ననెను. ఆ వృద్ధుఁ డామాటలకు 'మహారాజునకుఁ బ్రియమైన పని తా నొనర్పఁ గలుగు చున్నా' నని సంతసించి మంత్రి చెప్పినట్లే యా గ్రుడ్లనొక కదళీపత్రమునఁ బొదివికొని యాయనవెంట నడచెను.

కొంతదూర మరిగిన పిమ్మటఁ దిమ్మరుసు వానితో నిట్లనెను— 'ఓయీ! ప్రభువుచెంత నీవేమియు మాటాడరాదు సుమా! వారు చాల నాయాసపడుచున్నారు. మేము పిలిపింపఁగనే వచ్చి నీవు వీనిని వారి సన్నిధి నుంచి తిరిగి పోవలయును. పిమ్మట బహుమతికై రేపటియుదయమున నా కడకు రావచ్చును. ఈ సంగతి యెవ్వరితోను చెప్పరాదు; చెప్పినచో నీకు శిక్ష తప్పదు.'

వృద్ధుఁడు వెంటనే యిట్లనెను.— 'బాబయ్యా! పెలినవారి యాజ్ఞఁ దలఁ దాల్పమా? తప్పినచో కలుగు ప్రమాదము తెలియదా? అట్లే చేయుదును. అంతేగాక యిదేమి ఘనకార్యమని యితరులతోఁ జెప్పుకొందును?'

పిమ్మటఁ దిమ్మరుసు వానితో నంతిపురిఁ జేరి తన రాక మహారాజున కెఱిఁగించి యనుమతి గొని వారిని సందర్శించి కటికవానికిఁ గనుసన్న చేసెను. వాఁడు జడియుచు వచ్చి యరఁటియాకు పొట్లము మంత్రిసమీపమున నుంచెను. ప్రభువు వానిని జూచి 'నీభక్తికి సంతసించితిమి. కాని యిది లోకములో నెవరికైనఁ దెలిసినట్లు వింటిమా, నీమెడపైఁ దల నిలువదు. అప్పాజీ! వీనికిఁ గోశాగారమునుండి నేఁడే నూరు టంకము లిప్పింపుఁ'డనెను. తరువాత మంత్రి సంజ్ఞ చేసినంతనే వృద్ధుఁడు వెనుకకుఁ బోయెను.

అమాత్యుఁడా మేఁక కన్నులు ప్రభువునకుఁ జూపి యిట్లనెను. 'మహారాజా! ఈ యేఁబదియేండ్ల జీవితములో

యింతటి దారుణకార్యము నావలన జరుగలేదు. నేఁటికి...'
అర్ధోక్తియందుఁ బ్రభు వతనిని వారించి యిట్లనెను. 'అప్పాజీ!
మీరాజభక్తి యెట్టిదో నే నెఱుఁగనివాఁడను గాను. నేనును
సోదరవధఁ గావింప మనసొప్పక యింతమాత్రముననే సాహ
సించితిని. రాజ్యలోభ మెంత పని చేయించునో మీకుఁ దెలి
యనిది కాదు. ఇఁక నేను నిశ్చింతగాఁ బ్రాణములు వీడఁ
గలను. కుఱ్ఱవాఁడు మీ రక్షణమం దున్నచో, వాని నీశ్వరుఁ
డైనఁ గన్నెత్తి చూడఁజాలఁ డను నమ్మిక నాకున్నది.'

తరువాత మంత్రి స్వగృహమునకు వచ్చి సోదరుఁడగు
గోవిందరాజును బిలిచి కరణీయము బోధించి కృష్ణరాయని
చెంత కనిపెను. ప్రసన్నమనస్కుఁడై స్నానసంధ్యావంద
నములు ముగించుసరికి రాజభవనమునుండి పరిచారకుఁ
డొకఁడు వచ్చి 'ప్రభువులు విపరీతముగా నాయాసపడు
చున్నారు. వైద్యులు పలు చికిత్సలు సేయుచున్నారు.
తాము...'అని పైమాటఁ జెప్పలేని వానిదైన్యము గమనించి,
యాతురతతోఁ దిమ్మరుసు ప్రభుసందర్శనమునకుఁ జనెను.

తిమ్మరుసును జూడఁగనే ప్రభువు చెంతనున్నవారి నావ
లకుఁ బంపి యాయనను సెజ్జదాఁపునకుఁ బిలిచి కన్నీరొలుకు
చుండ నిట్లనెను—'అప్పాజీ! ఇంక...సె. ల. వు. వ. శ్చా.
త్తా. ప. ము. ద. హిం చు. చు. న్న. ది. పా. పి. ని.
క్ష. మ. వి. యా. పా. శా.'

తిమ్మరుసున కప్పుడు వీరనృసింహునియెడ నిజముగా జాలి కలిగెను. కృష్ణరాయలు బ్రతికియే యున్నాఁడని చెప్ప వచ్చు ననుకొనెను. కాని మృత్యుముఖ ప్రవిష్టుఁడగు నతని కింక నేదియో చికిత్సయే యవసరమని భావించి 'వైద్యులను చికిత్సకై ప్రోత్సహించెను. వైద్యులు మహారాజును బరీక్షించి పెదవి విఱచిరి. కొలఁది నిముసములలో వీరనృసింహుఁడు భౌతిక కాయముఁ బరిత్యజించెను. అంతిపురి రోదనములతోఁ బ్రతిధ్వనించెను. తిమ్మరుసు నిలువునఁ గ్రుంగిపోయెను.

౬

నాఁడు విద్యానగరములో నిసుక వైచిన రాలనట్లు జనసమ్మర్దమున వీథులు క్రిక్కిఱిసి యుండెను. పురమునకు నలువైపులను సామంతరాజుల పటకుటీరములు చంద్రికాపుం జములవలెఁ దేజరిల్లుచుండెను. నడగొండలవంటి మత్తగజ ములు, నిర్బంధ మోర్వని క్షీరసాగర వీచికలవంటి తురంగ ములు రాశీభూతాంధ్రోత్సాహ పరంపరలవలెఁ గనువిందు సేయుచుండెను. నందకముల చందమున నింపొందు తరవా రులు కరములం దలంకారములుగా రాజభటు లెల్లెడల సంచ రించు చుండిరి.

కొలువుకూటము మంత్రి సామంతనృప సేనాని ముఖ్యోద్యోగిబృందముతో నిండి యుండెను. కుమారవీర శ్యామలరాయఁడు, ఆర్వీటి శ్రీరంగరాజు, ఆకువీటి ఇమ్మ

రాజు, పెమ్మసాని రామలింగ భూపతి, నంద్యాల నారపరాజు మున్నగాఁ బ్రసిద్ధవీరు లందరు నుచితాసనముల నలంకరించి క్రొత్త చక్రవర్తి యాగమన మపేక్షించుచుండిరి.

అంతిపురిలోఁ బదియేండ్ల తిరుమలరాయలు జననిచే నలంకృతుఁడై యిట్టట్టు పర్విడుచుండెను. 'బాబూ! నీవు చక్రవర్తివి. నీ వొకచోట స్తిమితముగాఁ గూర్చుండ వలయును.' అని తల్లి హెచ్చరించుచుండఁగా 'నేను చక్రవర్తిని. నన్ను వారించుటకు నీ వెవతెవు? నోరు మూసికో; లేదా నీతల కోటగుమ్మమునకుఁ గట్టింతు' నని బాలచక్రవర్తి కనులెఱ్ఱ చేసెను. పాప మా తల్లి యా మాటలకుఁ దెల్లవోయెను. పరిచారికలు విస్మితలైరి. 'ఇంకను దిమ్మరుసు రాలేదు. తిరుమలరాయ లనఁగా నెవ్వరనుకొన్నాఁడో! రానీ! కన్నులు పెఱికించెదను' అని సింహాసన మింకను నధిష్ఠింపని పసిరాజకుఱలకుల విలువగు శబ్దము లుచ్చరించెను. కాని యపరాధి యింకను గంటఁబడలేదు. శిక్ష యమలు జరుగు టెట్లు?

అచట సభామందిరములోఁ బలువురు పలురీతులఁ దర్కించుకొనుచుండిరి. అప్పు డా చోటి కొక వ్యక్తి వచ్చెను. సభాసదు లతనివైపు నాశ్చర్యముతోఁ జూచిరి. అతఁడు సలకము తిమ్మయ్య. నరసనాయకులకు మేనల్లుఁడు. అతఁడు సభవారిని గలయఁజూచి యిట్లనెను.

'నేఁడు గద్దె నెక్కఁదగినవా రెవ్వ?' రను సమస్య నీ సభవారు పరిష్కరింపవలసి యున్నది. తిరుమలరాయలవారు

ముక్కుపచ్చలారనివారు. సాళ్వ నృసింహరాయల యనంతరము బాలరాజుల యేలుబడిలోఁ గలిగిన యలజడి యింతంత కాదు. మనకుఁ గావలసినది సామ్రాజ్య శ్రేయస్సు. విరూపాక్షరాయలనుండియు నీ దృష్టితోనే మనము సమర్థులగు ప్రభువులను వరించుచున్నాము. మన భాగ్యహీనతచే లోకోత్తర పరాక్రమశాలి యగు కృష్ణరాయలవారు క్రూరశిక్షకు గుఱియైరి. నరసనాయకుల సంతతిలో నచ్యుతదేవరాయలవారు, శ్రీరంగరాయలవారు నింకను నున్నారు. పసికూనను సింహాసన మెక్కించిన నో నాడుపెత్తనము బలియును. ఇప్పటికే అహమ్మదునగరప్రభువు మన సీమపైఁ గన్నువైచినట్లు తెలియవచ్చుచున్నది. మృత్యుగ్రస్తులగు వేళ వీరనృసింహులు భవిష్యత్తూహింపఁజాలక యకార్యమే చేయించిరి. బుద్ధిలో బృహస్పతి యనఁదగు ప్రధాని తిమ్మరుసుగారాయనకుఁ దాళమువైచుటెంతయు శోచనీయము. కనుకఁ దిరుమలరాయలవారి పట్టాభిషేకము గాని, తిమ్మరుసుగారి మంత్రిత్వము గాని మనకు వాంఛనీయములు గావు. సకల సద్గుణ సంపన్నులగు నచ్యుతదేవరాయలవారే సింహాసన మధిష్ఠింపవలయును. ఈ నా యభిప్రాయముతో మీరందఱు ఏకీభవింతు రనియే విశ్వసింతును. తిమ్మరుసు తిరుమలదేవరాయలవారిని గద్దెపై నెక్కించి తన యధికారమును నిలుపుకొనఁజూచుచున్నాఁడు. ఆ ద్రోహి కంటఁబడినంతనే కృష్ణరాయలవారి నేమి చేసెనో విచారించి, తగు శిక్ష విధించుటయు నీ పరిషత్తు కర్తవ్యము. సభవా రామోదముఁ దెలిపి.

నంతనే యచ్యుతదేవరాయ సార్వభౌములను గొనివచ్చుటకై నేను సిద్ధముగ నున్నాను.'

అతని ప్రసంగము ముగియఁగనే సభలోఁ గలవర మారంభ మయ్యెను. 'తిమ్మరుసుగారు — కృష్ణరాయలను జంపించినారఁట!—వీరనృసింహరాయలయాజ్ఞ యట్లున్నదఁట! ఆయన యేమిచేయఁగలఁడు?—రాజాజ్ఞ నిర్వర్తించినాఁడు. అంత ఘోరమా?—చెప్పెడివారికి లేకున్నను వినెడివారికైన వివేక ముండవలదా?—ఆహా! కృష్ణదేవరాయలవారివంటి తేజశ్శాలి మఱలఁ గనఁబడునా?—పాడు రాజ్యాకాంక్ష యెంతపని చేయును?—తన మంత్రిపదవి నిలుపుకొనుటకుఁ దిమ్మరు సింత చేయునా?—ఆ స్వార్థపరుని శిక్షింపవలసి నదే—సలకము తిమ్మయ్యగారు చెప్పినది నిజము—ఈ సింహాసనము సమర్థు లధిష్ఠింపఁదగినదే గాని యవ్యక్తు లధిష్ఠింపఁదగినది కాదు.' అను వాక్యము లందందుఁ బుట్టెను. తిమ్మయ మొగము వికసించెను.

అంతలో వెలుపల నొక కోలాహలము వినవచ్చెను. 'ఎవఁడు వాఁడు? నన్ను సింహాసన మెక్కనీయఁడా?' యను మాటలును వినిపించెను. ఆ పలుకులు తిరుమలదేవరాయలవే! సభ యంతయు నాశ్చర్యచకిత మయ్యెను. ఖడ్గహస్తుఁడై రాజపుత్త్రుఁడు తన్ను బట్టవచ్చు పరిచారికలను బెదరించుచు లోనికి వచ్చెను. తిమ్మయకన్నులు జేవురించెను. అతఁ డొక్క యుఱుకతో రాకుమారునిఁ బట్టుకొనెను. 'ఓయి

తిమ్మండా! నన్నుఁ బట్టుకొందువా? చూడు. నిన్నేమి చేసెదనో! ఇందాఁకఁ దిమ్మరుసుగ్రుడ్లే పెఱికింపవలెననుకొంటిని. ఇప్పుడు నీకన్నులుకూడఁ బెఱికింతును. తిమ్మరుసు, తిమ్మయ్యల తలలు కోటగుమ్మమునఁ గట్టింతును' అని తిరుమలదేవరాయలు గర్జించెను.

వీరనృసింహాభిమానులగు యోధులా గర్జలకుఁ బులకితులైరి. 'సెబాస్! రాకుమారా? సెబాస్' అని వారేక గ్రీవముగా నభినందించిరి. తిమ్మయ విభ్రాంతుఁడయ్యెను. ఆ పరిస్థితిలోఁ దానేమి మాటాడవలెనో యతనికిఁ దెలియదయ్యెను. కొంతసేపటికిఁ దన్ను దాను సంబాళించుకొని పెమ్మసాని రామలింగభూపతిఁ జూచి యిట్లనెను. 'వీర శిఖామణీ! అమాత్యుఁడు తిమ్మరుసింతవఱకిటు రాలేదు. సింహాసన మెవ్వరధిష్ఠింప వలయునో నిర్ణయించుటకు మీకంటె నధికారులు లేరు. అచ్యుతదేవరాయలవారు నాకై యెదురు చూచుచుందురు. ఇఁకఁ గర్తవ్యము మీకు వదలిపెట్టుచున్నాను.'

తిమ్మయమాటలు ముగిసియు ముగియకమునుపే యట కొక రాజభటుఁడు వచ్చి సభవారి నుద్దేశించి యిట్లనెను—

'ప్రధాని తిమ్మరుసుగారు తమపై సలకము తిమ్మయ్యగారారోపించిన నేరమునకుఁ దగు సమాధానముఁ దెలుపుకొనఁ గోరుచున్నారు. దీనికై ముందుగా రామలింగ భూపతుల దర్శన మపేక్షించుచున్నారు.'

రామలింగభూపతి యీ మాటలు విని సభవారి నుద్దే శించి 'నేఁటివఱకు రాజ్యచక్రముఁ ద్రిప్పువారు తిమ్మరుసు గారు. వారిపై నారోపింపఁబడిన నేరమునకుఁ దగు సమాధాన మేమో మనము వినవలయును. అటు పిమ్మట మన మందఱము గూడి కార్యము నిర్ణయింపవచ్చును.' అని పలికి సభ్యుల యనుమతిఁ గొని వార్తాహరుని వెంట సభాభవనము వదలి యరి గెను. ఈ యవకాశములోఁ దిరుమలరాయలు తిమ్మయసట్టు వదలించుకొని సింహాసనము దాఁపునకుఁ బోయెను. పైకె క్కుట కుపాయము తోఁపక, యీ రత్నపీఠము కొసలు పాద ములు చీల్పఁగా నొచ్చి కూలఁబడి రోదన మారంభించెను. మంగళ వాద్యఘోషతో గద్దియ నెక్కవలసిన రాకుమారుఁ డట్లు విలాపముతో రాజపీఠ మధిరోహింపఁబూనుట యశుభ హేతువుగా సభవారికిఁ దోఁచెను. అచ్యుతదేవరాయాభిమాని యగు వీరుఁ డొకఁ డా బాలుని సమీపించి 'బాబూ! ఇది యెక్కుటకుఁ దగిన యర్హత నీకింకను రాలేదు. నాదగ్గఱకు ర'మ్మని యెత్తుకొనఁబోయెను. 'నీగ్రుడ్లు పెఱికింతును. నీతల నఱికింతును. చక్రవర్తిగారిని నన్నుముట్టుకొందువా?' యని రాజపుత్త్రుఁ డేడ్చుచునే గర్జించెను. ఆ పలుకులకు నంద్యాల నారపరాజు నవ్వుచు నిట్లనెను—'ఈ చిన్ని రాయలవారు కంటఁబడినవారి కందఱికి మరణదండనము విధించుటయే చక్రవర్తిత్వ మనుకొనుచున్నారు. ఇట్టివారి యేలుబడి యందుఁ బ్రజ లెంత సుఖింతురో!' ఆర్వీటి శ్రీరంగరా జిట్ల నెను. 'బాలనాయకత్వము, బహునాయకత్వము నెట్లు

డునో కనులారఁ జూచు నవకాశము లభించుచున్నాఁడ. ఇది యొక యదృష్టమే!' శ్యామలరాయఁ డిట్లనెను. 'మన మిచ్చట నిందఱము కూడి యుండి యశ్లీలములు నవాచ్యములు సాగ నిచ్చుట యాంధ్రజాతికే తలవంపు. ముందుగాఁ జిన్నరాయల వారిని భద్రముగా నంతఃపురమునకుఁ బంపవలయును. రామ లింగభూపతి వచ్చినంతనే సర్వము నిర్ణయించుకొనవచ్చును.' వీరనృసింహాభిమానుల గువారును బాలరాజువిపరీతవాక్య ములు, చేష్టలు గమనించి నిరుత్సాహులైరి. సభాసదుల యామోదముతో నలువురు రాజభటులా పసిరాజును బట్టు కొని యంతిపురికిఁ గొనిపోయిరి. 'నీ తలఁగొట్టింతును. నీ పండ్లు రాల్పింతును. నీ గ్రుడ్లు తోడింతు' ననుచు రాకుమారుఁ డఱచుచునే పోయెను.

ఆ వెనుకనే 'జయ జయ తుళువ నృసింహేశ్వర కుమారా! జయ జయ సంగర రంగపార్థా! జయ నాగాంబా గర్భశుక్తి ముక్తాఫలా! జయ జయ శ్రీకృష్ణదేవరాయ ప్రభూ!' అను జయఘోషణ వినవచ్చెను. సభాసదు లాశ్చ ర్యోత్సాహములతో నా నినాదము లాలించుచుండఁగా దక్షిణభాగమునఁ దిమ్మరుసు మంత్రియు, వామపార్శ్వమందు రామలింగభూపతియు ననుసరించుచుండ నచ్యుతదేవరాయల కైదండతో శ్రీకృష్ణదేవరాయలు సభామందిరమునఁ బ్రవే శించెను. శ్యామలరాయాది సామంతనృపాలు రందఱుఁ దమ తమ యాసనములనుండి దిగి, వినయ వినమితో త్తమాంగులై నిలిచిరి. తిమ్మయ మొగమునఁ గాఱుచీఁకటు లావరించెను.

తిమ్మరు సంతటఁ బౌరిమ సుల నుద్దేశించి యిట్లనెను—'వీరే శ్రీకృష్ణదేవరాయలవారు! వీరే అచ్యుత దేవరాయలవారు! తిరుమలదేవరాయలవా రంతఃపురమున నుండి యుందు రనుకొందును. సలకము తిమ్మయగారు నాపై నారోపించిన యపరాధముయొక్క పుట్టుపూర్వోత్తరములు నే వేఱుగా వివరింపనక్కఱలేదు. ఆ యపరాధమునకీ పరిషత్తు విధింపనున్న శిక్షను సంతోషముతో స్వీకరింతును. రామలింగ భూపతి, శ్యామలరాయలు, శ్రీరంగరాయలు, నారపరాజు గారు, ఇమ్మరాజుగారు మున్నగు పెద్దలందఱు విచ్చేసినారు. భవిష్యత్సార్వభౌమ వరణాధికారము వీరికి వదలుచున్నాను. మతిభ్రమతోనో, స్వార్థపరతతోనో, యెట్లో యింతవఱకీ రాచకొల్వు చేసితిని. ఇఁక నే నిందుఁ దలదూర్చ నిచ్చగింపను. సభవారు దోషిపట్ల మొగమోటమిఁ జూపక శిక్షింపవలయును.'

మిన్నువిఱిగి మీఁదఁబడినను జలింపని మహామంత్రి ధీరత సభ్యులను ముగ్ధుల నొనర్చెను. రామలింగప్రముఖులగు సామంతభూపతు లందఱు 'మహామంత్రీ! మీరే రాజద్రోహులైనచో నూగతి యేమి? సామ్రాజ్య నౌకకుఁ గర్ణధారులై మీ రుండుటచేతనే యిందనుక నీ యోడ యెట్టి పాషాణము లెదురైనను విచ్ఛిన్నము గాక సుకరముగఁ బ్రయాణించుచున్నది. ఎవరిని మీరు వధించినట్లు వదంతి పుట్టినదో వారే యపూర్వోత్సాహముతో నిచటికి వేంచేసి యుండఁగా నిఁక దోషమెక్కడ? విచారణయెక్కడ? వీర

నృసింహరాయలవారి యానఁగూడ ధైర్యముతో నెదుర్కొని మీరొక దివ్యరత్నమును రక్షించి సర్వాంధ్రజాతికి,సకలదక్షిణ భారతమునకు మహోపకార మొనర్చితిరి. ఈ ఋణము మే మెట్లు తీర్చుకొనఁగలమో యూహింపఁజాలకున్నాము. తామే వైదొలఁగితిరేని ఈ సామ్రాజ్యము నిలుచునా? శ్రీకృష్ణ దేవరాయలవారే మా చక్రవర్తులు. మీరే మా ప్రధానులు.' అని యుద్ఘోషించిరి. సలకము తిమ్మయ యిఁక నక్కడ నిలువలేక పోయెను. ఎవని యాధారముతో తా నొక నాటక మాడఁదలఁచెనో యా యచ్యుత దేవరాయఁడే తిమ్మయ దెస ననహ్యావీక్షలఁ బఱపెను.

కృష్ణరాయఁ డపుడు పారిషదుల నుద్దేశించి యిట్లనెను- "అన్నగారియాజ్ఞ యెట్టిదయినను పాలించుటకు నేను శిర మొగ్గితిని. అప్పాజీ నాయందలి వాత్సల్యముచే నన్ను వధింపఁ జాలక పోయెను. నా యన్నకుమారుఁడు గాని, నా తమ్ముఁడు గాని, యెవరు పట్టాభిషిక్తులయినను నాకు విచారము లేదు. నిష్కళంక దేశభక్తులైన యప్పాజీగారిపై నారోపితమైన యపయశమును దొలఁగించు నిమిత్తమే నే నిటకు వచ్చితిని. నూతనసార్వభౌములు నాసేవ నపేక్షించినచో యథాశక్తిగా విరూపాక్ష దేవస్థానమునకై నాశక్తి సామర్థ్యములను వినియోగింపఁగలను. లేదా విష్ణుచిత్తునివలె 'గృహసమ్మార్జనమో, జలాహరణమో, శృంగారపల్యంకికా వహనంబో'–యేరీతినేని నారాయణార్చనతోఁ దనువు ధన్యము గావించుకొందును.'

తత్క్షణమే రామలింగభూపతి యిట్లనెను. 'ప్రభువుల నోటివెంట వచ్చిన నుడువులు మమ్ము లజ్జాక్రాంతులను గావించుచున్నవి. తమవంటి చక్రవర్తులు, తిమ్మరుసుగారి వంటి ప్రధానులు సమకూడుట ప్రజాసముదాయముయొక్క భాగ్యవిశేషము. దీనిని గాదనువారీ సభలోఁ గాని, యీ దేశములోఁ గాని యుండరని చెప్పఁగలను. మా యెల్లరి ప్రార్థన మంగీకరించి దేవర యీ రత్నసింహాసనము నలంకరింపవలయును. దీనికి భిన్నముగ జరిగినచో మేమందఱము తమవెంటనే నడువఁగలము.'

శ్రీరంగరాయాదులగు సామంతులు నట్లే నుడివిరి. వీరనృసింహరాయనియం దనురక్తులగువారును గృష్ణరాయల మహోదాత్తకు ముగ్ధులైరి. సభాభవన మంతయు 'జయజయ శ్రీకృష్ణరాయ చక్రవర్తీ!' యను నినాదముతో నిండిపోయెను. తిమ్మరుసు ప్రధాని, కాఁబోవు చక్రవర్తి వైపు సహర్షముగాఁ జూచి యొక సంజ్ఞ చేసి సభాభవనము వెనుకఁగల యంతర్గృహములోనికి నడచెను. మంత్రముగ్ధునివలె రాయ లతనివెంట నరిగెను. ఏకాంతము లభించినంతనే యప్పాజీ 'రా నాయనా!' యని యతనినిఁ జేరఁబిలిచెను. వినయవినమ్రుఁడై కృష్ణరాయఁడా మేధానిధిచెంత నిలిచెను. మఱుని మేషములోఁ దిమ్మరుసతని కపోలముపై సత్తువకొలఁది నొక చపేటముఁ జఱచెను. విస్మితుఁడై కనులనీరు గ్రుక్కుకొనుచు రాయ లప్పాజీవైపు చూచెను. తత్క్షణమే తిమ్మరుసతనిఁ గౌఁగిలించుకొని సాశ్రునయనుఁడై యిట్లనెను. 'వత్సా! ఈ క్షణముతో నీపై నా

యధికారము ముగియుచున్నది. ఇఁక నీవు రాజవు. నేను నీ కింకరుఁడను. అధికారము మహామోహాస్థానము. వివిధరీతుల దండ్యులు నీకుఁ గానవత్తురు. నీవు తీర్చిన తీర్పునకుఁ దిరుగుండదు. ఈ చపేట మొక్కటి నీ కెంత వేదనఁ గల్గించెనో జ్ఞప్తి యందుంచుకొని యపరాధులను శిక్షించునెడలఁ గరుణాళువై తప్పునకుఁ దగుశిక్షలే తప్ప క్రూరశిక్షలు విధింపరాదు. ఇది నీకు మనసులో నాటుకొనుటకే నిరపరాధివగు నిన్ను నే నిట్లు బాధించితిని. మనసులో నొచ్చుకొనకుందువుగాక! ఇఁక రమ్ము. సింహాసనాధిరోహణమునకు వేళ కావచ్చినది.'

రాయ లానందముతోఁ దిమ్మరుసుమొగము నుపలక్షించి యిట్లనెను— 'అప్పాజీ! ఏనాఁటికైన నేను మిమ్మిట్లే సంబోధింతును. ఇట్లే సంభావింతును. తిరుమలరాయాదుల యెడఁగాని, సలకము తిమ్మయప్రముఖులపట్లఁగాని, తదితరు లెవ్వరియెడలఁగాని నేను క్రూరుఁడను గాఁజాలను. ముఖ్యముగా నీ రాజబంధువులను మీరు మనసులోఁ బెట్టుకొనియే యిట్లు చేసితి రనుకొందును. మీ కా సందేహ మక్కఱ లేదు. ఆజ్ఞాపత్త్రిముపై వ్రాఁత, భావము మీవి. సంతకము మాత్రమే నాది. పెద్దలయనుమతి లేక యీ కృష్ణరాయ లెన్నఁడును స్వతంత్రించి దేనిని నిర్ణయింపఁడు.'

ఆ పలుకుల కప్పాజీ ప్రముదితుఁ డయ్యెను. ఆనంద బాష్పములు ముక్తాఫలములవలె నా మహనీయుని నేత్రాంచలములనుండి తొరఁగెను. కంఠము స్తంభించెను. కుడిచేత రాయలను గాఁగిలించుకొని సభామందిరమువైపు నడచెను.

ఆ రాజమంత్రుల ప్రవేశము సభాభవనమున కపూర్వశోభను వెలయించెను. విప్రనికాయ ముఖరిత వేదనాదములలో శ్రీ కృష్ణదేవరాయచక్రవర్తి రత్నసింహాసనము నధిరోహించెను. మలయజమువలె సుశీతలమై, శరజ్జ్యోత్స్నవలె ధవళమై యొక క్రొత్త వెలుఁగు నలుగడల మెండుకొనెను. దివ్యదుందుభిధ్వానమో యనఁ బంపాపతి యాలయమందుండి ఘంటా నినాదము బోరుకొనెను. తిమ్మరుసుమంత్రి కనుదమ్ములు తఱపి వెన్నెలలు కురిసెను. సభాసదుల నేత్రాంచలములనుండి విద్యుత్తులే ప్రసరించెను.

౨

అది నిశీథము. ఆకసము మబ్బులతో మెండుకొని కాటుక పులిమినట్లుండెను. శ్రవణకుహరవిదారణదారుణములై పర్జన్యగర్జలు వినవచ్చుచుండెను. ఇహసుఖమ్ములవలెఁ జంచల లపుడపుడు మెఱసిపోవుచుండెను. ఆ నిశియం దొక పట్టణమున కీవలఁ గోటనలుగడల విడిసియున్న వాహిని నిద్రాముద్రితమై యుండెను. కాని యా సేనానివహములో నొక పటమందిరమం దిరువురు వ్యక్తులు విషాదములో మునిఁగి నిద్రలేక పరస్పర ముఖావలోకన మొనర్చుకొనుచుండిరి. ఆ వ్యక్తులలో నొకఁడు ధాత్రి కవతరించిన జయంత కుమారుని వలె సౌందర్యరాశియై, నవయౌవన విభాసితుఁడై యుండెను. రెండవ వ్యక్తి కఱువదియైదేం డ్లుండవచ్చును. వారిట్లు మాటలాడుకొన సాగిరి.

యువ:—అప్పాజీ! ఈ కాళింగులతోడి యుద్ధ మింత తీవ్రమై యుండునని నేను దలంపనైతిని. తొట్టతొలుత మీా రెంతగాఁ జెప్పినను, యౌవనగర్వముచేఁ జెవిఁబెట్టనైతిని. ఈ కటకపట్టణము నెన్నాళ్లు ముట్టడించినను నీఁగ కా లంతయైన మార్గము కానవచ్చునట్లు లేదు. పైఁగా మన కిచట నంతయుఁ గ్రొత్త. సైనికు లలసిరి. ఆహారపదార్థములు కొఱవడినవి. ముట్టడి మాని వెనుదిరుగుట నా చరిత్రలో నింతవఱకు లేదు. నాఁడు నా సవతి తల్లియు, నన్నయుఁ బన్నిన యురులనుండి నా ప్రాణములఁ గాపాడితిరి. నేఁడు నా ప్రతిష్ఠఁ గాపాడ వలయును.

వృద్ధుఁడు:—వత్సా! నీమాట కాదనలేక నగరమున కరిగితిని గాని నిన్నిందు విడిచిపోవఁ గాల్లాడె ననుకొంటివా? మూలబలమునుండి కొంత సేనను, ఆహారపదార్థములను దెచ్చుటకుఁ బోయితిని కదా! ఇపు డాహారపదార్థములకు లోటులేదు. క్రొత్తసేనయు వచ్చినది. కాని నీ వన్నట్లీ దుర్గ మభేద్యము. దండముచే నిటఁ గార్యమును సాధింపఁ జాలము.

యువ:—గజపతి దురభిమాని. తా నొక్కఁడే సుక్షత్త్రియుఁ డనుకొనును. ఇట్టివాఁడు సామముచే స్వాధీనుఁ డగునా?

వృద్ధుఁడు:—కాకపోనిమ్ము. వే ఱుపాయము లేదా?

యువ:—ఉండవచ్చును. అట్టిది మనకుఁ బ్రతిష్ఠా హేతువు కాదు. దానివలన నా వాంఛయు సిద్ధింపదు.

వృద్ధుఁడు :—బాబూ! నీ వాంఛ నే నెఱుఁగుదును. అది సాధింపఁగోరియేకదా నాఁడట్లు వైదిక బ్రాహ్మణవేషములతో రాకుమారిని సందర్శించితిమి! తుక్కాదేవి నీకుఁదగిన దేదేరిసుమా! నాఁడు నీ చిత్రపటమువైపు ప్రసరించిన యామె దృష్టిని నీవు గమనింపలేదు; కాని నేను గమనించితిని. ఆమె నీయందనురక్త; ఐనను దురభిమాని గజపతి యామెను నీ కిచ్చుట కంగీకరింపఁడు.

యువ :—అప్పాజీ! ఆ సమయములో నా దివ్యసుందరి మొగమునఁ బరిభ్రమించు నా దృష్టి కేవల మున్మత్తమైనది.

వృద్ధుఁడు:—మన మఁట క్షణ మాలసించియున్న గజపతి చేతులలోఁ బడెడివారమే!

యువ :—ఔను. ఆ రజకుఁడు ద్వారమున కడ్డముగా బాహువులు సారించి నిల్చెను గదా! 'దండాలు దండాలు, మడివేలుగారు!' అన్న మీ మాటలే కదా వానిని విభ్రాంతునిఁ జేసినవి! వాఁడు తత్తఱపడి మీకు నమస్కరించు నంతలో నే నీవలఁ బడితిని. నాకొఱకై మీరు వాని బాహువుల క్రిందుగనే నడచితిరి. అప్పాజీ! మీరు పడని శ్రమ యేది? సర్వము నాకై ధారపోయుచున్నారు. తిమ్మరుసు గారి మంత్రబలముచేఁ బగవా రెంతవారైనఁ బాదాక్రాంతులు కాఁజాలుదు రను ధైర్యము నాకున్నది. ఆ ధైర్యమే ఇంత పని చేయించినది. ఇప్పుడు నా కార్య మన్యథా జరిగెనేని యీ యప్రతిష్ఠలో............

వృద్ధుఁడు :—నాకును భాగము తప్పదందువు. నాయనా! ఇది నీవు వేఱుగాఁ జెప్పవలయునా? సైంధవుని వధింపఁ బూనిన యర్జునుని గృష్ణుఁడు వదలిపెట్టెనా?

యువ :—నిజముగా నిది సైంధవవధవంటి ఘట్టమే! మీ మంత్రప్రయోగ కౌశలమున కిది పరీక్షా సమయము. ఆ పాత్రులు వీరరసావతారులు. పద్మవ్యూహమునాఁడు సంశప్తకులవలె వీరు మనలను నిరోధించుచున్నారు.

వృద్ధుఁడు :—చక్కఁగా జ్ఞప్తికిఁ దెచ్చితివి. గజపతికిని, పాత్రులకును భేదముఁ బుట్టించుటే యిప్పుడు మనము చేయవలసిన పని.

యువ :—అది సాధ్యమా! వారు కర్ణునివంటి స్వామిభక్తులు.

వృద్ధుఁడు :—ఔను. వారటువంటివారే! అయినను మలయకేతువునకు, రాక్షసునకు విభేదమును జాణక్యుఁ డెట్లు కల్గించెనో యొక్కమాఱు స్మరింపుము. ఆ యుపాయమే నేఁ డవలంబింపఁదగినది. నీ వికఁ విశ్రాంతిఁ గైగొనుము. రేపటి సాయంకాలము లోపుగఁ గళింగనరపతి నీ పాదపీఠము నాశ్రయించునట్లు కావింతును.

యువ :—ఇఁక నాకు విచారములేదు. గుండెపైఁ జేయిడుకొని హాయిగా నిద్రింతును.

వృద్ధుఁడు :—నీ యంగుళీయక మిటు లిమ్ము. దీనితో సర్వము సాధింతును. సూర్యోదయముతో నీ మనస్సు నావరించిన చీఁకటులును జెదరిపోఁగలవు.

ఇట్లు పలికి యతఁడు పోయెను. యువకుఁడు ప్రశాంత చిత్తుఁడై నిద్రింపఁబోయెను. ఆ వృద్ధుఁడే యాంధ్రచాణక్యుఁడు తిమ్మరుసనియు, యువకుఁ డాంధ్ర చక్రవర్తి శ్రీ కృష్ణదేవ రాయలనియు పాఠకులు గ్రహించియే యుందురు.

రాయలను వీడ్కొని వచ్చిన తిమ్మరు సాక్కు మాఱు గగనము వీక్షించెను. అంతదనుక నం దావరించియున్న కాఱు మబ్బు లేమయ్యెనో ? ఆకాశము వినిర్మలమై తోఁచెను. ఆశా జ్యోతులవలెఁ దారకాసముదాయము ప్రకాశించెను. ఆ యుఱుములు, మెఱుపులు లేనే లేవు. ప్రధాని కది యొక శుభ శకునముగా స్ఫురించెను. అతని మొగ మానందప్రఫుల్ల మయ్యెను. అతఁడు వడివడిగా నొకగుడారముచెంత కరిగి 'యెవ రక్కడ ?' అని ప్రశ్నించెను. రాజభటుఁడు చకితుఁడై కంఠ స్వరము గుర్తించి మహామంత్రి యని గ్రహించి 'చిత్తము. నేను భద్రుఁడను. ఏమి సెలవు ?' అని యంజలిబద్ధుఁడై నిలిచెను. 'పెద్దనామాత్యు లీ వేళకు మేల్కొనియే యుందురా ?' యని యమాత్యుఁ డతనిని బ్రశ్నించెను. భటుఁడు సమాధాన మీయకముందే పటమందిరమునుండి పెద్దన మహాకవి యీవలికి వచ్చి 'అప్పాజీ! అస లీరేయి నేను నిద్రించినఁ గదా! ఏవో రకరకముల యూహలు! మీ బాలభారత వ్యాఖ్య మఱల మఱలఁ జదివితిని. పంచతంత్రము

తిరుగవైచితిని. ఏమైన నాకాశహర్మ్యములు కట్టఁగలవాఁడనే కాని మీఁవలెఁ గార్యనిర్వహణము సేయఁజాలను గదా! రండు, లోనికిఁబోవుద' మని యాహ్వానించెను.

అల్లసాని పెద్దన, రాయలయాస్థానములోని అష్టదిగ్గజములలో ముఖ్యుఁడు. రాయలకును, మంత్రికి నత్యంత ప్రీతిపాత్రుఁడు. యుద్ధసమయములలోఁగూడ రాయల వెంటనే యుండి చక్కని యాలోచనలు చెప్పుచుండును ; ఉత్సాహమును కల్గించుచుండును.

పిదప మంత్రియు, పెద్దనామాత్యుఁడును గుడారము లోనికిఁ బోయిరి. వా రే యే విషయములు ముచ్చటించిరో చెప్పఁజాలము కాని యొక గంటసేపు గడచినపిదపఁ గవీశ్వరుఁడు 'భద్రా!' యని పిలిచెను. భద్రుఁడు లోని కరిగి యజమానిని జూచి విస్మితుఁడయ్యెను. ఆ వేషమేమి? అచ్చముగా వణిగ్రూప మాయనయందు నెలకొన్నట్లుండెను. కంఠస్వరముచేత యజమాని యని యనుకొననే కాని లేనిచో పోల్చుటకే వీలులేదు. ఆశ్చర్యముతోఁ దనవంకఁ గన్నార్పక చూచు భద్రునిఁ గని నవ్వి పెద్దనామాత్యుఁ డిట్లనెను. 'నీవు నాయొద్ద నేర్చుకొన్న విద్యకు నేఁడు గురుదక్షిణ చెల్లింపవలయును. అందులకు సిద్ధముగా నున్నావా?'

భద్రుఁడు వెంటనే సహర్షముగా నిట్లనెను—'ఆ విషయములో నే నేకలవ్యునికిఁ దీసిపోను. ఏమి చేయవలయునో సెలవిండు.'

మనవారి నేడుగురి నిటకుఁ బిలుచుకొని రమ్ము. వారితోఁబాటు నీవు, నీ సోదరు లాఱుగురును రావలయును. ఎంత త్వరగా రాఁగలవో చూతును' అని పెద్దన సూచన తిచ్చెను.

భద్రుఁడు వెంటనే 'మహాప్రసాద'మని వెడలిపోయెను. అప్పుడు తిమ్మరుసు పెద్దన కవీశ్వరునితో నిట్లనెను. 'నా సోదరుఁడు గోవిందుఁడు కూడ మీతో వచ్చెను. పదునార్గురు పాత్రులు; పదునార్గురు వర్తకులు. కాదు కాదు. గూఢ చారులు. ఒక్కొక్కరికడ నొక ముక్తాహారము, రాజ ముద్రికాంకితలేఖ. ఈ సార్థవాహసమూహమునకుఁ బెద్దలు మీరు. ఇఁక నే నచ్చటి సంభాషణక్రమమును నడపించు టెట్టి దట్టి దని వివరింపఁ బూనుకొనను. సకలమునకు మీరే యున్నారు. మీ రందఱును గజపతికంటఁ బడవలయును. అతఁడు మి మ్మనుమానింపవలయును. మిమ్ము బరీక్షింప వలయును. ఈ లేఖలు వానికంటఁ బడవలయును. వాని గుండె చెదరవలయును. మఱునిమేషమున నతఁ డాంధ్రచక్రవర్తి పాదములపై వ్రాలవలయును.'

పెద్దన ఇట్లు పలికెను—'అమాత్యశేఖరా! ఇది విజయవర్యవసానము కాఁగలదనియే గ్రహబలమువలన నూహించుచున్నాను. కానినాఁడు పెద్దనయే లేఁడు. కావ్య కథానిర్మితి యొక విశేషము గాదు. ఈ నాటక నిర్వహణమే విశేషము.'

తిమ్మరు సేమో పలుకఁ బోవుచుండఁగనే భద్రుం డందఱితోను వచ్చెను. తిమ్మరుసు వారితో సాదరముగా నిట్లనెను—'ఆర్యులారా! మీకు ఏ శేషించి చెప్పఁబనిలేదు. మీ రిపుడు మా గూఢచారులు. ఇచ్చటి లేఖలును. ముత్తెపుఁ బేరులుఁ దల కొకటి తీసికొని గుప్తపఱుపుఁడు. ఈ లేఖలు, హారములుఁ బాత్రులకుఁగాఁ గొనిపోవుచున్నట్లుండి గజపతిచేఁ బట్టువడుదురుగాక! అచటి మీ వాక్చాతుర్యము గజపతికి మతిభ్రమను పుట్టింపవలయును. ఆతఁడు మన సార్వభౌముల శ్రీచరణములే శరణముగాఁ బర్వెత్తి రావలయును. ఏదేని ప్రమాదము వాటిల్లున ట్లున్నచోఁ బెద్దనామాత్యులకడ నున్న రక్తాంశుకము మింట నాడఁగలదు. ఆ నిమిషముననే యాంధ్రవీరులు మీకు బాసటకాఁగలరు. మీరు కృతార్థులగుదురు గాక!'

ఆయనపలుకులు ముగిసిన పిమ్మట వారందఱు వణిగ్వేషములు ధరించిరి. పాత్రసోదరులు పదునార్గురికి వేర్వేఱుగా లేఖలను, ముత్యాలదండలను దమ తమ యంగీలలో భద్రపఱచి, పటమందిరమునుండి పదునార్గురును వెలుపలికి వచ్చిరి.

తూర్పుఁగొండ మీఁదికి లోకబాంధవుఁడు వచ్చెను. ఇరుపక్షములవారు యుద్ధ సన్నద్ధులై యుండిరి. పెమ్మసాని రామలింగభూపతి, ఆర్వీటి శ్రీరంగరాయలు తోడుగాఁ దిమ్మరుసు గజపతి యున్నయెడకు సేనల నడిపింపఁదలచెను. నంద్యాల నారపరాజు, ఆకువీటి ఇమ్మరాజు, కుమార వీర శ్యామలరాయఁడు, రావెల పెదతిమ్మరాజు, వెలుగోటి చిన

తిమ్మరాజు నను నైదుగురు మహావీరులు సహాయులుగా శ్రీ కృష్ణరాయలు పాత్రుల నావరింపఁదలఁచెను.

ఆంధ్రు లెంతో యుత్సాహముతో నున్నట్లు గజపతికిఁ దోఁచెను. ఆ యుత్సాహమునకుఁ గారణమేమో తెలియ లేదు. 'కటకము దక్కెన్, గజపతి చిక్కెన్' అను కేకలు వినవచ్చుచుండెను. గజపతి యా కేకలు వినవచ్చు దెసఁ బరికించెను. అవి శత్రుపక్షమునుండియే వచ్చుచుండెను. కళింగ వల్లభుఁడు కొంత యధైర్యపడినను పాత్రులను వలపోసి ధైర్యము వహించెను. కాని నాఁడు పాత్రు లింతవఱకును తనకడకు రాకుండుటచే రాజు కలఁతపడెను.

'గజపతి చిక్కె'నను నాంధ్రవీరుల హర్షధ్వానములకుఁ గొంత దూరములో నున్న పాత్రులు విచలితులైరి. తమ తేఁ డేమయ్యెనో, నిజముగనే వైరులకుఁ జిక్కెనేమో యను ననుమానము వారికిఁ గలిగెను. ఆ యనుమానముఁ దీర్చుకొనుటకు వారు శత్రుశిబిరములను దాఁటి పోవలసి యుండెను. శత్రువు లతిజాగరూకతతో నుండుటచేఁ బ్రస్తుత మట్లుచేయ సాధ్యము కాకుండెను.

ఇటు గజపతి పరివారమున కల్లంతదూరమున నొకచ నుప యిట్లు గానముచేయుచు సాగి వచ్చుచుండెను.

'జాతిరత్నాలయ్య! జాతి రత్నాలు!
స్వాతిశుక్తులలోని వరమౌక్తికాలు
మేలైన సరుకులు, మెఱుఁగెంచి కొనుఁడి,
ఆలసించిన నాశ యడియాస సుండి.

లలనల వాతెఱల్ దలఁపించుఁ గొన్ని
పొలఁతుల దరహాసములఁ బోలుఁ గొన్ని
కొనరయ్య తెలుఁగులు కొనరయ్య మీరు!
కనరయ్య యోధులు కనరయ్య మీరు!
మీ యందచందాలు మెఱుఁగెక్కఁగలవు.
మీ యంతరంగాలు మిసిమింపఁగలవు.
జాతిరత్నాలయ్య! జాతిరత్నాలు
స్వాతిశుక్తులలోని వరమౌక్తికాలు
మేలైన సరుకులు మెఱుఁగించి కొనుఁడి.
ఆలసించిన నాశ యడియాస సుండి.'

గజపతి సార్థవాహుల తెగువ కబ్బురపడెను. బయటికి వచ్చి వారినే చూడఁదొడఁగెను. అంతలో మఱియొక వైపుననుండి

'కటకము దక్కెఁగా గజపతి చిక్కెఁగా
కృషి ఫలియించెఁగా తృష శమియించెన్'

అను గేయము వినవచ్చెను. అతనికన్ను లంతలోఁ జింతనిప్పు లయ్యెను. ఆ గేయ మాలపించినవానితల కఱుక్కునఁ ద్రెంపఁజూచెను. కాని వానికిని దనకును జాల దూరముండెను. చనుప తనకుఁ జేరువయ్యెను.

'తెలుఁగు దేశములోని దివ్యరత్నాలు!
ఇల సాటి గనరాని యివి చిరత్నాలు!
అడిగి చూడుఁడు పాత్రు లందఱిన్నీరు;
విడువనేఱరు మాదు బేరమ్ము వారు.'

అని సార్థవాహు లొక నూతన గేయ మందుకొనిరి. 'వీ రాంధ్రులా ? పాత్రులు వీరికిఁ బరిచితులా ? ఆ హేతువున నే వీ రింత నిర్భయముగా సాగివచ్చుచున్నారా!' యని యోధులు తలపోసిరి. కాని గజపతి కా గేయ మాలించుటతో నొక యనుమాన ముదయించెను. 'ఇది రణరంగము గదా! వీరితో నిప్పుడు తీఱికగా బేరము లాడు వా రెవరు? వీరిరాకలో నేదో నిగూఢరహస్య ముండి యుండు' నని యతఁడు తలపోసెను. ఆ చనుప నాయకుఁడు మహారాజును సమీపించి యిట్లనెను—
'రాజసింహులు మా వైపెట్లో చూచుచున్నారు! కొంతతడ వోపికతో మా సరకులు పరీక్షింతురా ?'

గజ:—ఓయీ! ఇది బేరములకుఁ దరుణమా ? మృత్యు దేవత విహరించు సమయము కదా!

నాయ:—మహారాజా! మనుష్యుఁడు జరామరణములు లేని వానివలె విద్యాధనములు గడింపవలెనను మాట మీరు వినలేదా! ఇట్లడిగెద రేమి ?

గజ:—ఇచ్చట నీతోఁ దీరికగా నెవరు ముచ్చటింతు రనుకొంటివి ?

నాయ:—ఏల ముచ్చటింపరు ? మాతో మాటలాడ నారంభింపవలెనే కాని, తర్వాత విడువమన్నను విడువరు.

నాయకుని మాటలు ముగియకమునుపే చనుపచివరి వాఁ డిట్లు గర్జించెను —'ఓరి యవివేకీ! నా తలపాగ ముట్టు

దువఁటరా! నేను వేషధారిననుకొంటివా ? తెలుఁగువారి తోనా నీ చెలగాటము ? నీ తల భద్రముగాఁ జూచుకో!'

నాయకుఁడు వెనుకకుఁ దిరిగి చూచి 'భద్రా! ఏ మట్లు క్రోధోద్రిక్తుఁడ వగుచున్నావు? ఇది రోషమునకుఁ దరుణమా?' యని మహారాజును జూచి 'చూచితిరా ప్రభూ! మీ భటుఁ డెవఁడో మావాని నవమానించినాఁడు. ధర్మ ప్రభువవు ; నీయెదుటనే యింత సాహసమా? మావాఁ డసలగ్గిరాముఁడు. నే నిక్కడ లేకున్న నీ పాటి కా భటునితల నేలఁబడి యుండును. అటు రాయలవారు, నిటు మీరు ధర్మమూర్తులని విశ్వసించి మా ప్రయాణ మిట్లు సాగించుచున్నాము. మా విశ్వాసము వ్యర్థమేనా? ఆ యల్పుఁడు మమ్ము సాధారణ వర్తకులుగా భావించినాఁడేమో! మాలో నొక్కొక్కఁడు వందమంది పెట్టు.' అని కను లెఱ్ఱచేసెను.

ఒక కళింగవీరుఁ డా పలుకులు విని ప్రభువుతో నిట్లనెను—'మహారాజా! సాధారణవర్తకుల కింత ధైర్యముండునా? వీ రెవరో శత్రుగూఢచారులే. ఆలసింపక వీరి ప్రయాణము నాఁపి, పరీక్షించుటకు సెల వీయవలయును.'

భద్రుఁ డా పలుకులు విని 'ఓరి యవివేకీ! మేమా గూఢచారులము! మమ్ముఁ బరీక్షింపవలె నందువా? ఎన్ని రణరంగములలో మేము వ్యాపారము చేసితిమో యెఱుఁగుదువా? రాయలవారివెంట' నని వెంటనే నాలుకఁ గఱచుకొని యాఁగెను. గజపతికి వారు రాయలపక్షపువారే యని తోఁచెను. 'వీరు వర్తకులగుదురో కారో పరీక్షింప వలసినదే!

యను పలుకు లతనినోటినుండి వెలువడెను. తత్క్షణమే కళింగ భటులా సార్థవాహులను ముట్టడించిరి. సార్థవాహు లటు నిటుఁ బర్విడఁగోరుచున్నట్లు నటించి, త్వరలోనే కాళింగు లకు వశపడిరి. ఒక భటుఁడు భద్రుని తలపాగ కత్తితో నెగురఁగొట్టెను. ఉత్తరక్షణమునందే గజపతి విజయాశవలె ముక్తాహారమొకటియు, దానివెంట నొకలేఖయు నేలఁబడెను. మహారా జాశ్చర్యచకితుఁడయ్యెను.

ఆ లేఖ పాత్రసోదరులలో నగ్రజునిపేర లిఖింపఁబడి యుండెను. అడుగునఁ గృష్ణరాయల ముద్ర కానవచ్చుచుం డెను. ఆ లేఖలో నిట్లుండెను.

'గజపతి సజీవు మా కిచ్చి, కటకమెల్ల
మాకు సామంతులై యేల మనసుగొన్న
మిమ్ము మెచ్చితి ; మిఁక మన మిత్రభావ
మునకు ముత్తెపుసరు లివి పొసఁగఁగొనుఁడు.'

మేరుగంభీరుఁడగు ప్రతాపరుద్రుఁ డా లేఖాంశముఁ జదివి విచలితుఁడయ్యెను. వెంటనే తన ప్రధానిని పిలిపించెను. బద్ధులగు వర్తకులను జూపి తాఁ జదివిన జాబతని కిచ్చెను. మంత్రి యది చదువుకొని రిచ్చవడెను. మిగిలిన వర్తకులను గూడ శోధింపుఁ డని భటుల కాజ్ఞయిచ్చెను. పదునైదు లేఖలు, పదునైదు ముత్యాల హారములు దొరకెను. లేఖ లన్నిటిలో నొకటే యంశము. అన్నియు వేర్వేఱుగాఁ బాత్ర సోదరుల కుద్దేశింపఁబడినవే!

'మహారాజా! పాత్రులు విశ్వాసపాత్రులు కారనఁజాలము; ఈ జాబులనుబట్టి వారిని నమ్ముటయు మేలు కాఁజాలదు. నేఁటి యాంధ్రోత్సాహమునకు మూలము పాత్రుల ద్రోహమే కావచ్చునేమో! మనమే యేల సంధికిఁ బ్రయత్నింపరాదు? అనుజ్ఞయైన సంధిసూచకముగా.........' అని కటకప్రధాని యేమో యనుచుండెను.

'కానిమ్ము. ఇప్పట్టున నదియే యుచితముగాఁ దోఁచుచున్నది. తనకు తుక్కాదేవి నిచ్చి పరిణయముఁ గావించినచో వెనుదిరిగి పోదునని రాయలనుండి తొట్టతొలుత మనకు వర్తమానము వచ్చినది కదా! అతని యభీష్టమిప్పుడు నెఱవేర్తము. మన గౌరవము నిలువఁగలదు. స్వామిద్రోహులగు పాత్రుల విషయ మవ్వల విచారింతము' అని ప్రతాపరుద్రగజపతి నిట్టూర్చుచుఁ బలికెను.

వెంటనే ప్రధాని సంధికేతన మెత్తించెను. 'జయ జయ శత్రుసమవర్తీ! శ్రీ కృష్ణదేవరాయచక్రవర్తీ!' యను నినాదము లాంధ్రసైన్యమునుండి బయల్వెడలెను. సామాత్యుఁడై కళింగవిభుఁడు త్రిలింగ విభుని సందర్శింపఁ జనెను. శ్రీ రంగరాయాదులతో శ్రీ కృష్ణరాయ సార్వభౌముఁడు, తన్ను సందర్శింప వచ్చు గజపతి కెదురేఁగెను. అంతవఱకు బద్ధవైరులగు నుభయచక్రవర్తులుఁ బ్రాణమిత్రులవలెఁ బరస్పర సంభావనలు నెఱపిరి. రాయలు సగౌరవముగఁ గళింగ ప్రభునిఁ దన గుడారములోనికిఁ దీసికొని పోయెను. అందఱు నుచితాసనములపైఁ గూర్చున్న పిదప రాయలవారి

యనుజ్ఞతోఁ దిమ్మరు సిట్లు ప్రసంగించెను.—'గజపతులవారితోఁ గయ్యము గోరి మేము రానే లేదు. వియ్యమే వాంఛించితిమి. అయినను శౌర్యసముద్రులగు ప్రతాపరుద్రులు తమ జామాత విక్రమముఁ బరీక్షింపఁదలఁచి యీ వినోదము సాగించిరి. అల్లుని సామర్థ్యము శ్రీవారి మదికి వచ్చినది. కృతార్థులమైతిమి. చిరకాలముగాఁ త్రైలింగ కాళింగులనడుమ రాఁజుచున్న విద్వేషాగ్ని యీ వియ్యముతోఁ జల్లారి యుభయరాజ్యములకు స్నేహబాంధవ్యము లింపొందుఁగాక !'

ఆ పలుకులకు గజపతి సంతుష్టుఁడయ్యెను. అతని ముఖమున నొక వింత చెలువము ప్రకాశించెను. సహజగాంభీర్యము చిక్కఁబట్టి యతఁడిట్లనెను—'తిమ్మరుసుగారి పలుకులు సమంజసములు. శ్రీకృష్ణరాయలవారు మాకు జామాత యగుట మా భాగ్యవిశేషము !'

గజపతి ననుసరించి వచ్చిన చనుపనాయకుఁ డిట్లు తన సంతోషముఁ బ్రకటించెను.

ఉ॥ 'మామ ప్రతాపరుద్రుఁ డసమాన
గభీరత దుగ్ధవార్ధి, క
న్యామణి భూతలాగతరమాంగన,
యల్లుఁ డఖండ విక్రమ

శ్రీమహిమాంచితుండు నరసింహుని
కృష్ణుఁడు, బాంధవంబుతో
రీమెయి నొప్పునే సుకృతమెంతయు లేక ?
యహో! శుభోన్నతుల్ !'

రాయ లానందముతో నా సార్థవాహనాయకునిఁ గవుఁగలించుకొని 'మహాకవీ! మీ ప్రయత్నము కృతార్థమైనది. కృతజ్ఞుఁడను. ఇఁక మీ రీ వేషములు విడువవచ్చును' అని సంభావించెను. 'పెద్దనామాత్యులు, వారి శిష్యులు, గోవిందప్రధాని, భద్రసోదరులు, సార్థవాహాహులై గజపతులవారిని బెదరించి' రని యాంధ్ర వీరులు గుసగుసలాడఁ జొచ్చిరి. గజపతి తిమ్మరుసుమంత్రి ప్రతిభావిశేషమున కచ్చెరువడెను. ఆనందాశ్చర్య రసములలో నా పటకుటీర మోలలాడెను.

ం

తిమ్మరుసుమంత్రికిఁ దాను గుర్వాదేశముఁ జక్కఁగాఁ బాలింపఁగలిగితి నను విశ్వాస మేర్పడెను. 'అహో! సత్పురుషుల సంకల్పములు వ్యర్థములు గావను మాట నాకుఁ జక్కగా నను భవగోచరమైనది. చిట్టిగంగనామాత్యుల యుపదేశమే బలముగా రాజకీయములలోఁ బ్రవేశించితిని. ఎన్ని చిక్కుసమస్యలు! ఎన్ని యపనిందలు! ఎన్ని యవరోధములు! అన్నియు మబ్బులు క్రమ్మినట్లు క్రమ్మి యుపాయమారుతముచేఁ జెదరి

పోయినవి. నావలన నింత పని కాఁగలదని చిన్ననాఁడూహించితినా? ఆ మహాయోగి యేమో చెప్పెననుకొంటిని. ఆయన మాట లక్షరశః ఫలించినవి. మహారాజు కృష్ణరాయఁడు కారణ జన్ముఁడు. అంతటివానికిఁ జేఁదోడు వాఁదోఁడుగా నుండి నా మాటయే యతని మాటగా రాజ్యచక్రముఁ ద్రిప్పఁగలిగితిని. ఆంధ్రభాష, ఆంధ్రసంస్కృతి, ఆంధ్రవిక్రాంతి సకలజనమాననీయము లయినవి. ఈశ్వరుఁడు నాచే నింత చేయించినాఁడు. ఇఁకఁ జాలును. వార్ధకము మునివృత్తితోఁ గడపి పుట్టువు ధన్యముఁ గావించుకొందు'' నని యతఁడు నిర్ణయించుకొనెను.

నాఁడు మహారాజునకుఁ దన యభిప్రాయ మెఱింగించి యనుమతిఁ గొనవలెనని సంకల్పించుకొనియే తిమ్మరుసాస్థానము డాసెను. అచటఁ బ్రజ లనేకులు గుమిగూడి మహాబలశాలి నొకని రెక్కలు విఱిచికట్టి 'చంపుఁడు చంపుఁ'డని యఱచుచుండిరి. రాజభటు లా కోలాహలము నివారించుచు బందీనీవలకుఁ గొని వచ్చుచుండిరి. మహామంత్రిని జూచినంతనే ప్రజలకోలాహల ముపశమించెను. భటులను జూచి యమాత్యుఁ 'డీతఁడెవ్వఁడు? వీని నేల యిట్లు హింసింప వలసివచ్చెను?' అనఁగా నా ప్రజలలో నొక వృద్ధుఁ డిట్లనెను. 'అప్పాజీ! వీఁ డెక్కడి వాఁడో యెఱుఁగము. రాత్రి వర్షములో మా యింటికి వచ్చెను. జాలిపడి యరుగుపైఁ జోటిచ్చితిమి. మా యన్నగారు వీనితోనేమో ప్రసంగించుచుండిరి. మే మింటియందు మా మా పనులలో నుంటిమి. మా యన్నగారు వార్ధక

మునకు వ్యాధి యొకటి తోడు కాఁగా దగ్గుతో బాధపడు చుండిరి. అయ్యో! ఏమని చెప్పుదుము! ఆకస్మికముగా మా యన్నగారి యార్తరావము వినిపించెను. మేము బయటికిఁ బరువెత్తుకొని వచ్చునప్పటికి వీఁడాయనను నడిమికి నఱికినాఁడు. మేము కేకలు వేయఁగాఁ బదిమందియు మూగిరి. వీనిని బట్టుకొనిరి. 'ఆయన నిన్నేమనెను? ఏల చంపితి?' వనఁగా వీఁడొకే జబాబు చెప్పుచున్నాఁడు. 'నేను దగ్గవలదన్నను దగ్గినాఁడు; కనుకఁ జంపితి'నని, నేను వీని నక్కడనే చంపి యుందును. కాని న్యాయాన్యాయములు విచారించు ప్రభువు లుండఁగా మే మేల సాహసింపవలెనని యిటకుఁ దోడ్కొని వచ్చితిమి.'

అప్పాజీ యా వృత్తాంతము విని యా నరహంత నెగాదిగఁ జూచి పిమ్మట నా వృద్ధునితో నిట్లనెను—'మంచి పనియే చేసితివి. రాజసమక్షమున సర్వము వినిపింపుము. ఈ యున్మత్తునికిఁ దగు శిక్ష వారే విధింపఁగలరు' ఇట్లు పలికి యాయన కొలువుకూటమునకుఁ బోయెను.

కొన్ని క్షణములలో నపరాధి, ప్రజలు సభలోనికి వచ్చిరి. ప్రభుని చూపు తనవైపు మఱలఁగనే యమాత్యుఁడు తొలుతఁ దనతో మాటలాడిన వృద్ధునిఁ జూచి 'వీనికథ సర్వము వినిపింపు'మనెను. వృద్ధుఁడు పూసగ్రుచ్చినట్లు సర్వము నివేదించెను. పిమ్మట నమాత్యుఁ డా హంతను జూచి 'నీవేమందువు?' వనఁగా వాఁడు నదురు బెదురు లేక యిట్లనెను.

''అయ్యా! మాది విజాపురము. నా పరాక్రమమునకుఁ దగిన యుద్యోగ మచట లభింపలేదు. రాయలవారి యొద్దఁ దగు నుద్యోగము దొఱకునని వచ్చితిని. ఈ వృద్ధుఁడు చెప్పిన మాటలలో నసత్యము లేదు. నాకు దగ్గుచున్నవారి పొడ గిట్టదు. మా తాత యిట్లే దగ్గుచు నెంత వలదన్నను మాన నందున, వానిని జంపివైచితిని. మావాండ్రు నన్నింటినుండి తఱిమివైచిరి. ఈనాఁడును నటువంటి స్థితియే కలిగెను. నేను శూరుఁడను; నా మాటఁ జెవిబెట్టనివానిని మన్నింపను. ఇఁక మీ రేమిచేసినను సరే.'

సభాసదు లాతని పలుకులు విని పకాలున నవ్విరి. చక్రవర్తి మంత్రిని జూచి యిట్లనెను—'అప్పాజీ! వీని కేమి శిక్ష విధింపవలయునో తోఁచుటలేదు. మీరే సెలవీయ వలయును.' మహామంత్రి యొకింతసేపు ధ్యాన మవలంబించి యపరాధి నాపాదమస్తకము పరీక్షించి యిట్లనెను. 'ఆఱు నెలలపాటు వీనికిఁ గోరిన తిండి పెట్టుచుఁ బ్రజలకంటఁ బడకుండ రాజభటులు కాచి యుందురుగాక! ఇప్పటి కింతే చేయఁదగినది, తరువాత వీని విషయము విచారింపవచ్చును.'

అపరాధి పలుకులు విన్నప్పటికంటెఁ దీర్పరి పలుకులు వినినప్పుడు కొలువుకూట మధికాశ్చర్యమున మునిఁగెను. 'ఇదేమి తీర్పు? అంతటి ఘోరకృత్యముఁ జేసినవాని కింతటి సత్కారమా? మహామంత్రి యభిప్రాయమేమో!' యని యెల్లరును దెల్లవోయిరి. మహారాజనుమతితో భటు లా యపరాధి నావలకుఁ గొనిపోయిరి.

పిమ్మట మహామంత్రి చక్రవర్తిని, సభాసదులను గలయఁ జూచి యిట్లనెను—'మహారాజా! ఈ యపరాధి విచిత్ర వ్యక్తి. వీఁ డెన్నఁడైన మన కుపయోగింపఁగలఁడు. నే నిట్టి తీర్పు నిచ్చినందులకు సభ్యులు నాకు మతిభ్రమణము కలిగినట్లు భావింపవచ్చును. నా యూహ సమంజసమని కొన్నాళ్లకైనఁ దేటతెల్లము కాఁగల దనుకొందును. ఇఁక దీని నిటుంచుఁడు.

ప్రభువర్యా! మన యేలుబడిలోని భూభాగములోఁ బ్రజలు యుద్ధభయము గాని, చోరపీడ గాని లేక సుఖులై పాడిపంటలతోఁ దులతూఁగుచున్నారు. పెద్దన, ధూర్జటి, తిమ్మనలు, రామభద్ర,మల్లనలు, భట్టుమూర్తి, సూరన, రామ కృష్ణులు మన భువనవిజయము నలంకరించి సారస్వతసేవ చేయు చున్నారు. పెద్దనగారి మనుచరిత్రము, తిమ్మనగారి పారిజాతాప హరణము దేవర కాచంద్రార్క కీర్తి సంపాదింపఁగలవు. అష్టదిగ్గజము లను ప్రశస్తి వీరి కెంతయుఁ దగి యున్నది. ధూర్జటి ముఖ్యులును గవితావ్యాసంగము సేయుచునే యున్నారు. తమ యాముక్తమాల్యద, మదాలస చరిత్ర, సత్యావధూ ప్రీణనము నాంధ్రగీర్వాణ వాఙ్మయముల కమూ ల్యాలంకారములు. అటు ప్రజాసేవ, ఇటు భాషాసేవ. యొకే బిగువునఁ గొనసాగుచున్నవి.

మహారాజా! మన విద్యానగర మమరావతిని దలఁపించు ననుట యతిశయోక్తి కాఁజాలదు. శిల్పకళ మీ పోషణమునఁ బరమోచ్చదశఁ గన్నది. ఉగ్రనరసింహమూర్తి, పంపాపతి గోపురము, కృష్ణాలయము, అంతఃపురవధూ స్నానమందిరము,

గజశాల, వాజిశాల మున్నగునవి మన పురలక్ష్మికి సాటిలేని యలంకారములు. నవరత్న విక్రయవీథి మన దేశ సంపదకుఁ దార్కాణము.

తురుష్కులకు మీ పేరు సింహస్వప్నము. ఉత్కళులు మీకు విధేయులు. చోళులు, పాండ్యులు నామమాత్రావశిష్టులు. పొట్నూరు, సింహాచలములందు దేవర దిగ్విజయ స్తంభములు చరిత్రాత్మకములుగా వెలుఁగొందుచున్నవి. కామానాయకుఁడు, తిమ్మప్పనాయకుఁడు, ఆదెప్పనాయకుఁడు, కొండారెడ్డి, విశ్వనాథనాయకుఁడు, కుమారవీరశ్యామల రాయఁడు, నా సోదరుఁడు గోవిందుఁడు, మీ యల్లుండ్రగు రామరాయలు, తిరుమలరాయలు, మీ సోదరుఁ డచ్యుతదేవ రాయలు మున్నగు వీరశిఖామణులు, నవయువకులు సామ్రాజ్య సౌధమునకు రత్నస్తంభములుగాఁ బ్రకాశించుచున్నారు. క్రిస్టోవిడిఫిగరిడో మున్నగు పాశ్చాత్యవీరులును దమ కనుంగు భృత్యులుగా నున్నారు.

ఆంధ్రధీ రాంధ్ర విక్రాంతి శ్చాంధ్రవా గాంధ్రసంస్కృతిః,
సర్వాంధ్రశ్రీస్సదా భాత్యాం భూయాసుస్సకలోన్నతాః.

అని యవితథవాక్యుఁడు పినవీరభద్రకవి యెన్నఁడో మేము విద్యానగరమునఁ బ్రవేశించునాఁ డాశీర్వదించెను. ఆ యాశీర్వాద మిప్పుడు వీసమంతైనఁ బొల్లుపోక ఫలించినది. ఈ సంతోషమే డెబ్బదియైదేండ్లు పైఁబడిన నన్ను నవోత్సాహవంతునిఁ జేయుచున్నది. కాని...

నేనీనాఁడు మిమ్మొకటి కోరుచున్నాను. ఏనాఁడును నేను మిమ్మేదియు నభ్యర్థించి యెఱుఁగను. కనుక దీనినిఁ గాదన రనుకొందురు. అఱువదేండ్ల క్రిందట నీ రాజకీయములలోఁ బ్రవేశించితిని.సమర్థుఁడైన చక్రవర్తికొఱకై తపించితిని. నిందల కోర్చితిని. మృత్యుబంధములఁ దగుల్కొంటిని. ఈశ్వర కటాక్షముచే నన్నియుఁ గడచినవి. తమవంటి చక్రవర్తి ప్రజల భాగ్యవశమునఁ గలిగెను. నే నిఁకఁ జేయవలసినది కానఁబడదు. తూర్పునఁ గటకమువఱకుఁ దెలుఁగువారి యధికారము విస్తరించినది. దక్షిణమున సేతువువఱకు రాయలవారి యాజ్ఞ చెల్లుచున్నది. పశ్చిమమున విజాపురమే మన రాజ్యమునకు సరిహద్దు. విజాపురాధీశుఁడును మీసౌహార్దమునకై ప్రయత్నించుచున్నాఁడు. వింధ్యమే యుత్తర దిశలో నెల్లగా నున్నది. ముదిగల్లు, రాయచూరు దుర్గములు మాత్రమే మనము సాధింపవలసినవి. అవియును విజాపురీశుని వగుటచే సామముననే లభింపవచ్చు ననుకొందును.

సార్వభౌమా! కాళిదాస మహాకవియొక్క 'వార్ధకే మునివృత్తీనాం' అని పలుకుబడికిఁ దగు రీతిని నేను నీశ్వరారాధనమున నవసానకాలముఁ బ్రశాంతముగాఁ గడపఁ గోరెదను. ఇదే నాకోరిక. మీరు కాదనక యనుమతింపవలయును.'

తిమ్మరుసు నభ్యర్థన మాలించిన పరిషత్తు కొంత తడవు మౌనమవలంబించెను. సార్వభౌముఁడు దీనాననుఁ డయ్యెను.

పారిషదు లా చక్రవర్తి ముఖలక్షణము లరసి, తిమ్మరుసు మంత్రిని బరిశీలించి, యేమి జరుగునో యని తెప్పవాల్పక చూచుచుండిరి. ఒకింత తడవునకుఁ జక్రవర్తి గాద్గద్యము నడఁచుకొనుచు నిట్లనెను—'అప్పాజీ! నే ననుమతి నిచ్చువాఁడను, మీరు శిరసావహించువారు నగుట కలదా ? మీతోడి వాఁడనే నేను. అచ్యుతదేవుని సింహాసనముపై నిలిపి నేనును మి మ్మనుసరింతును. బెజవాడ కనకదుర్గాదేవిని సందర్శించినపుడు మీ రేమంటిరో నే నేమంటినో యొకసారి స్మరింపుఁడు. న్యాయపాలనకై కుమారుని వధించి, ప్రజార్థమై మాధవవర్మమహారా జసువుల నిలుపుకొనె నంటిరి. ఆ ధర్మ దీక్షకే దుర్గాదేవి మెచ్చి సువర్ణవర్షము గురియించె నంటిరి. మానవసేవయే మాధవసేవ యని చెప్పితిరి. రాజమహేంద్ర వరములో నేమంటిరో మీరు మఱచిపోవచ్చును. నేను మఱువలేను. కృష్ణాగౌతమీనదులవలె, మన జీవనము లేకో న్ముఖములై దేశసౌభాగ్యహేతువులు కావలెనని చెప్పితిరి. ఈ నాఁ డిట్లు మీరు నన్ను విసర్జించి పోవచ్చునా ? ప్రజా శ్రేయస్సునకై పాటుపడుటయే భగవదర్చ సేయుట యను మీ యభిప్రాయమే దృఢమైనచో వేఱే తపోవ్రతాది నియమము లెందులకు ?'

యుక్తియుక్తమైన యీ ప్రసంగమును సభ్యులు మెచ్చిరి. తిమ్మరుసు నొక నిట్టూర్పు విడిచి యిట్లనెను— 'నాయనా ! శరీరదార్ఢ్యము, బుద్ధిపటుత్వము క్షీణించుచున్న యీ వయస్సులో నశ్రద్ధచేతనో, యసమర్థతచేతనో నావలన

రాజకార్యములు జరుగనేరవని యిట్లంటిని. నీ వంతగాఁ బట్టు పట్టినచో నేమి చేయుదును? నిన్ను విడువను; గాని కార్య భారము సహింపఁజాలను. ఊరక కొలువునకు వచ్చి పోవు చుందును. రామరాయాదులు నాకు మాఱుగా నా యా కార్యములు విచారింతురుగాక !'

రాయల మొగము వికసించెను. సభ్యులు సంతసించిరి. రామరాయలు వెంటనే లేచి యిట్లనెను. 'అప్పాజీ! వయో ధర్మముచేత మీరు విశ్రాంతి నభిలషించుట సహజమే. కాని మీ స్థానమును మాత్రము నే నాక్రమింపఁజాలను. నేనే కాదు; ఈ కొలువుకూటములోనే దీని కర్హులుండనేరరు. మీ సంపూర్ణసహకారము లేనిదే యే కార్యమును నడువఁ జాలదు.'

సలకము తిమ్మయ చక్రవర్తి నుద్దేశించి యిట్లనెను— 'బావగారూ! అమాత్యులు నిజముగనే బలహీనులు. వారిపైఁ గార్యభారము మోపుటయు నుచితము గాదు. కావున మీ రనుమతించినచో నేను వారి శ్రమ కొంత తగ్గించుటకుఁ బ్రయత్నింతును.' సభాసదు లతని పలుకులకు హర్షింపలేదు. చక్రవర్తి లేనవ్వుతో నిట్లు పలికెను—'తిమ్మయగారి చాతు ర్యము మే మెఱుఁగనిది కాదు. అవసరమైనపుడు మేము వారి సాయము స్వీకరింపఁగలము. ఇఁక నప్పాజీ విషయమై రామరాయలు చెప్పిన మాటలతో మే మేకీభవించు చున్నాము. ఇపు డొక విషయమును చర్చింపవలసియున్నది.

ఆదిల్ శాహి రాయచూరులో నాంధ్రులనే కాక తదితరులగు హైందవులను గూడ నవమానించుచున్నట్లు తెలియవచ్చినది. అచటి ప్రజలనుండి దినదినము విజ్ఞప్తులు వచ్చుచున్నవి. ఆ దుర్గము తొట్టతొలుత విద్యానగరమువారిదే! ఎట్లో విజా పురీశునికిఁ జిక్కినది. నేఁ డతఁడు మిత్రుఁడై యుండుటవలన నతనితోఁ గలహ మిష్టము గాక యా దుర్గము నాసింప మైతిమి. ఇటీవల మనకు గుఱ్ఱములఁ గొని తెత్తునని వర్తకుఁడొకఁడు మన యొద్దనుండి ద్రవ్యముఁ గొనిపోయి మఱలఁ గంటఁబడఁ డయ్యెను. వానికై వెదకింపఁగా, వాఁడు విజాపురములో దాఁగి యున్నట్లు తెలియవచ్చినది. అతనిని బట్టి యొప్పగింప వలసినదని వార్త పంపఁగా నాదిల్ శాహి చెవిఁబెట్టలేదు. ఆ వంచకుని, నీగర్వోన్మత్తుని శిక్షించుటయు, మన దుర్గమును మనము కైవస మొనర్చుకొనుటయుఁ, బీడితప్రజల నుద్ధరించు టయు నను కార్యములు మూఁడును మనకుఁ గలసి వచ్చినవి. విజాపురముపై నెత్తి పోవుటయా? రాయచూరు ముట్టడించు టయా? యని మే మాలోచించుచున్నాము. అప్పాజీ యే మందురో!'

అప్పాజీ నవ్వుచు నిట్లనెను—'సలకము తిమ్మయ్య గారి కీ కార్యమప్పగించుట యుచితమని నాకుఁ దోఁచు చున్నది. ఇందు వారు కృతార్థులయినచో వారికిఁ బ్రధా నిత్వమును రాయలవారు ప్రసాదింపవలయును.

తిమ్మయ సగర్వముగా నిట్లనెను— 'అప్పాజీగారి యాదేశము మాకు శిరోధార్యము. సార్వభౌముల యనుమతి యైనచో నాదిల్‌శాహిని దండించి, యా వర్తకునిఁ బట్టుకొని దేవరపాదసన్నిధి నుంచెదను. రాయచూరు కైవసముఁ జేసి కొందును.'

కృష్ణరాయ లొకమాఱు ప్రధాని మొగమునఁ జూచి— నిలిపి యం దేభావము గోచరించెనో స్పష్టము గానీయక తిమ్మయతో నిట్లనెను—'బావగారూ! ఈ విషయమున మీరు మా ప్రతినిధులుగా సర్వాధికారములతోఁ బ్రవర్తింప వచ్చును. రామరాయాదివీరు లందఱు మి మ్మనుసరింతురు గాక!'

చక్రవర్తి నుడువులు ముగియుచుండఁగనే మధ్యాహ్న శంఖధ్వనులు మ్రోసెను. నాఁటికిఁ గొలువు ముగిసెను.



వైశాఖ మాసము వచ్చెను. వసంతములోని మాధుర్య మంతయు గతించిన ట్లుండెను. మఱి కొన్నినాళ్లకుఁగాని రాని గ్రీష్మర్తువప్పుడే వచ్చినట్లు తోఁచుచుండెను. పగలు వేఁడిమి చేతను, రేయి వాయువు స్తంభించిన ట్లుండుటచేతను ప్రజలు బయటను నిండ్లలోను గూడ నిలువఁజాలకుండిరి. అట్టి సమయమున రాయచూరుకోట కీవల నొక మహాసైన్యము విడిసి

యుండెను. వాహినికిఁ గేంద్రమందుఁ గల పటకుటీరములో శ్రీకృష్ణదేవరాయ లల్లసాని పెద్దనామాత్యుఁడు మున్నగు విద్వత్కవులతోఁ గవితాగోష్ఠి సలుపుచుండెను.

ఆ సమయమున దౌవారికుఁడు వచ్చి చక్రవర్తికి నమస్కరించి రామరాయలు దర్శన మపేక్షించుచున్నట్లు తెలియఁజేసెను. ప్రభువు శీఘ్రముగ నతనిఁ బ్రవేశపెట్టుమని సెలవిచ్చెను. మఱుక్షణములో రామరాయలు ప్రవేశించి చక్రవర్తితో నిట్లనెను—'ప్రభూ! తిమ్మయగారు మమ్ము విక్రమింపనీయలేదు. 'ఉపాయముతో నేనే యాదిల్ శాహిని లోఁబఱచుకొందు' నని విజాపురమునకుఁ బోయిరి. తిరిగి మా కంటఁ బడలేదు. ఆదిల్ శాహి యాతనిని బంధించినట్లు వేఁగులవాండ్రు చెప్పిరి. గోలకొండ, అహమ్మద్ నగరాధీశుల తోడ్పాటున నాదిల్ శాహి యిటకుఁ గదలివచ్చుచున్నాఁడఁట! మేము కాచియున్న మార్గముఁ దప్పించి వేఱొకమార్గముఁ బట్టినాఁడఁట! సూర్యోదయమున కిటకుఁ జేరుకొన వచ్చును.'

సార్వభౌముఁ డా పలుకులను విని యిట్లనెను— 'అప్పాజీ! తిమ్మయగారి యుత్తరకుమారప్రజ్ఞలు తేటతెల్లములైనవి. ఇఁకఁ గార్యవిధాన మాలోచింపుఁడు. విశేషజననష్టము కారాదు.'

తిమ్మరుసు :—ఎంత వదలించుకొంద మన్నను నాకీ రాజకీయ బంధము వదలినది కాదు. సరే! కానిండు. నే నౌనను నంతవఱకు మనవారిని శత్రువులపైఁ బడనీయకుఁడు.

పిమ్మట నందఱు డేరా వెలుపలికి వచ్చిరి. తిమ్మరుసు, శ్రీకృష్ణదేవరాయలు, రామరాయలు మాత్ర మొకచో నిలిచి యుండిరి.

అప్పుడు మహామంత్రి రామరాయలతో నిట్లనెను— 'వత్సా! నరహత్యాఫలితముగా మన కతిథి యైన యున్మత్తుఁడు నా బసలో నున్నాఁడు. భద్రముగా వాని నిటకుఁ బిలుచుకొని రాఁగలవా? ఈ పని చెప్పితినని కోపగించు కొందువా?'

రామరాయలు వినయ సూచక మందహాస మొకటి చేసి ప్రధానియాజ్ఞ నిర్వహింప నరిగెను.

కృష్ణ :—అప్పాజీ! ఆ యున్మత్తునిచే నేమి చేయింపఁ దలఁచితిరో నా యూహ కందుట లేదు.

తిమ్మ :—నాయనా! ఆదిల్‌శాహికిఁ దోడై వచ్చు నిబ్రహీంశాహి ముక్కోపి. మనవాఁడును ముక్కోపియే! దొందుకు దొందే యన్నట్లగును. వీనిచేతిలో వాఁడు కడ తేఱును. మన కొక శత్రువు తగ్గిపోవును.

ఇంతలోనే రామరాయ లా శౌర్యోన్మత్తునిఁ దోడ్కొని వచ్చెను. మంత్రి వానిని జూచి 'ఏమోయీ! నీవలన నొక

కార్యము కావలసి యున్నది. చేసెదవా?' యనెను. వాఁడు చూపులలో గాంభీర్య ముట్టిపడునట్టు లిట్లనెను. 'నేను చేయ లేని పని లేదు. తలపెట్టినది ఫలింపనినాఁడు నన్ను మీఁదు చూడరు. ఏమి కావలెనో చెప్పుఁడు.'

పిమ్మట నమాత్యుఁ డతని నేకాంతమునకుఁ గొని పోయి కొంతతడ వేమేమో చెప్పి, రాయలతో లోనికిఁబోయి యొక లేఖ వ్రాసి దానిపై రాజముద్రిక వేసి తెచ్చి యతనికిచ్చి యిట్లనెను. 'నీ విపుడు రాయలవారి రాయబారివై శత్రు శిబిరమునకుఁ బోవుచున్నావు. ఏ మాత్రము ప్రమత్తుఁడ వైనను శత్రువులు నిన్నుఁ గనికరింపరు. ఈ లేఖఁ జూచి వా రేమందురో మాకుఁ దెలుపుటయే నీ విధి. జాగ్రత్త!'

'నేను రాయలవారి రాయబారినా? మఱి నాకుఁ బరివారమో!' యని యున్మత్తుఁడు ప్రశ్నించెను. మంత్రి వెంటనే యిట్లనెను. 'మే మందఱము నీ పరివారములోని వారమే! కాని శత్రుశిబిరములో నొక్కనికే ప్రవేశము లభించును. అంతవఱకు మాత్రమే మేము నిన్ననుసరింతుము.'

ఉన్మత్తుఁడు సంతుష్టుఁడయ్యెను. అంతలోఁ దూర్పున నరుణరేఖలు తోఁచెను. కృష్ణ కావల మహమ్మదీయవాహిని గోచరించెను. చక్రవర్తియొద్ద సెలవు తీసికొని తిమ్మరుసు, రామరాయలు, నున్మత్తుఁడును వెడలిపోయిరి.

ఆ నాఁడంతయు నిరువాగులవారును నది కిరుగడలనుండి యొకరి నొకరు పరిశీలించుకొనుటతోనే కడచెను. ఆంధ్రులు

తన్ను మార్గోఁన వెఱచుచున్నారను నపోహ యాదిల్ శాహికిఁ గలిగెను. తత్క్షణమే నదిని దాఁటి యాంధ్రసైన్యములఁ దాఁకుఁడని యతఁడు తనవారి కాజ్ఞ యిచ్చెను. తిమ్మరుసునాదేశమునఁ దెలుఁగుసైనికులు శత్రువుల నదీతరణమున కవరోధముఁ గలిగింపలేదు. గర్వోన్మత్తుఁ డగు నాదిల్ శాహి ససైన్యుఁడై యీవలియొద్దు చేరెను. రాయల శిబిరముకంటె సుందరముగాఁ దన శిబిరము నిర్మింపించెను. సులతానులు మువ్వు రందు మంత్రాంగ మారంభించిరి. అంతలోనే యాంధ్రచక్రవర్తినుండి పంపఁబడిన దూత, దర్శన మపేక్షించుచుండెనని భటుఁడొకఁడు వచ్చి యాదిల్ శాహికి వినిపించెను. అహమ్మదు పురాధిపతి ఇబ్రహీం శాహి యా మాట విని యిట్లనెను—'మన వాహినిఁ జూచి రాయలు బెదరినాఁడు. ఇది సంధిప్రయత్నము కాఁబోలును! ఏమైనను మనము సంధి కంగీకరింపరాదు. ఆంధ్రుల పొగ రణఁచి విద్యానగరము రూపు మాపవలయును.'

ఆదిల్:—'నాయుద్దేశముగూడ నంతే. అదిగో! రాయబారి వచ్చినాఁడు. ఏమి చెప్పునో విందము'

అనునంతలో రాయబారి వచ్చెను.

అహమ్మద్ నగరాధిపతి వానిని చూచి 'ఓహో! వీఁడు మనవాఁడే! ఏమిరా? విజాతీయునియొద్దఁ గొలువు చేయుచున్నావా? జాతిగౌరవము మంటఁ గల్పితివి గదరా! ఇంతకు నీవు తెచ్చిన రాయబార మేమి?' అనెను.

ఆ సులతాను పలుకులకు రాయబారి కనులు జేవురించెను. పెదవు లదరెను. కాని తిమ్మరుసు మాటలు తలపోసి రోషము నిగ్రహించుకొని తన యంగీయందలి లేఖ నాదిల్ శాహి కిచ్చెను. అం దిట్లుండెను—

'ఆదిల్ శాహికి—

మూరురాయరగండాద్యనేకబిరుదవిభ్రాజితులు, దక్షిణదేశసార్వభౌములు శ్రీకృష్ణదేవరాయలవారు చేయు హెచ్చరిక యేమనఁగా—

ఓయి మూర్ఖుఁడా!

మిత్రద్రోహివై మా కపకార మొనర్చినవాని కాశ్రయ మిచ్చితివి. మా బాంధవుఁడు సలకము తిమ్మయ్యగారిని జెఱఁబెట్టితివి. మా హితోపదేశ మాలింపక నీవలె నవ్యక్తులగు నహమ్మదునగర, గోలకొండపురముల సులతానులను దోడుచేసికొని మాపై నెత్తివచ్చితివి. నీకుఁ బ్రాణముల మీఁది యాశ యున్నచో వెంటనే మాకు ద్రోహముఁజేసిన యా వర్తకుని, మా బంధువైన తిమ్మయ్యగారిని మా కొప్పగించుము. లేనిచో నీవు బ్రదుకవు. నీకు సాయపడువారును బ్రతుకరు.

శ్రీకృష్ణదేవరాయల యనుమతిని తిమ్మరుసుమంత్రి'

ఆ లేఖఁ జదువుచుండఁగనే ఇబ్రహీం శాహి పండ్లు పటపట కొఱికెను; రాయబారిని గాల్చివైచునట్లు చూచెను. చదు

వుట ముగియఁగనే యాపత్రమును దీసికొని శతఖండములుగాఁ జించి తురుష్కున నుమిసి దూతతో నిట్లనెను. 'బుద్ధిహీనుఁడా! ఈ లేఖ నెంతధైర్యముతోఁ దెచ్చితివి? సాటివాఁడవని వదలుచున్నాము. లేనిచో...' సులతానుమాటలు ముగియకముందే రాయల దూత యొఱనుండి కత్తి దూసి 'పశువా! నన్ను బుద్ధిహీనుఁ డందువా?' యని వానితల బంతివలె నెగురఁగొట్టెను! రక్తము చివ్వున నెగసి మిగిలిన యిద్దరు సులతానులను నభిషేకించెను. భయకంపితులై వారిద్దరు డేరావెలుపలికిఁ బరుగిడి వచ్చిరి. 'చంపుడు. ఆ రాయబారిని జంపుఁ' డని వారు బొబ్బలు వెట్టిరి. యవనసైనికు లా దూతను ముట్టడించిరి. అంతలో నాంధ్రసైన్యములు వారిని గవిసెను. రామరాయాదివీరులు పరాక్రమించి యాదిల్ శాహి పటమందిరముఁ జొచ్చి యహమ్మద్ పురీశుని ఖండితమస్తకమును భల్లాగ్రమునకు గ్రుచ్చి మహమ్మదీయసైనికులకుఁ జూపిరి. అహమ్మద్ నగర సైన్య మా దృశ్యముఁ జూచి చెదరిపోయెను.

ఆదిల్ శాహి నిజాంశాహులు తెలుఁగుసేనకంటె నధికముగా నున్న తమసేనఁ జూచుకొని విజయము తమకే లభింపఁగలదను విశ్వాసము వహించి పోరు నడపసాగిరి. అది కళింగయుద్ధముకంటెను ఘోరమైనది. సప్తలక్షాధికమైన కాల్బలము, ద్వాత్రింశత్సహస్రమైన యశ్వదళము, పంచశతాధిక మాతంగములు గల యాంధ్రవాహిని యా రణమునఁ బాల్గొనెను. తురుష్కవాహిని యింతకు మించియే యుండెను. కాని యాంధ్రసైనికులు సంగరపార్థుఁడగు కృష్ణరాయల యాధి

పత్యమునఁ బెక్కు రణములలో నాఱితేఱిన జోదు లగుట పలన శత్రువుల కుక్కుతునుకలుగాఁ జూపట్టిరి. క్రిస్తో విడిఫిగరిడో యాధిపత్యమునఁ బోర్చుగీసులు చక్రవర్తికి బాసటయైరి.

అహమ్మదునగరాధిపతి శీర్షాలంకృతభల్లముతో రామరాయలు ప్రత్యక్షమైన వోట నెల్ల యవనసేన పంచబంగాళ మగుచుండెను. విశ్వనాథనాయకాదుల విజృంభణము దుర్వార మయ్యెను. కృష్ణరాయలు గర్వోన్మత్తుఁడైన యాదిల్‌శాహిని వెన్నంటెను. ఆదిల్‌శాహి యా సార్వభౌముని ధాటి కోర్వఁజాలకపోయెను.

'యథారాజా తథాప్రజాః' యను న్యాయము ననుసరించి యతని సైనికులును క్షణక్షణమునకు వెనుకంజవేయఁ జొడఁగిరి. భాస్కరుఁడు పశ్చిమసముద్రమును గదియుచుండఁగా యవనసైనికులు కృష్ణవేణిని గదిసిరి. ఆంధ్రవీరుల తీవ్రఖడ్గాఘాతముల పాలై మరణించుటకంటెఁ జల్లనిప్రవాహమునఁబడి యసువులఁ గోల్పోఁదలఁచిరి. ఒక్కరొక్కరుగా నందఱు ప్రవాహమున దుమికిరి. క్రిస్తోవిడిఫిగరిడో వారిపై శతఘ్నులు ప్రయోగింపఁజొచ్చెను. చరమసంధ్యారుణకాంతులలో రూపుకట్టిన యాంధ్రతేజమువలెఁ గృష్ణాతరంగిణి రక్తచ్ఛవులు వెలార్చెను. క్షతగాత్రులగు యవనవీరుల కీలాలముతోఁ గలిసి యది మఱింత దుర్నిరీక్ష్య మయ్యెను. మత్తగజములపై బోరగిలఁబడి యెట్టెటో యాదిల్‌శాహి, నిజాంశాహులు కృష్ణయవ్వలిగట్టుఁ జేరిరి. అంటనుండి పాదచారులై

సాంద్రారణ్యములఁ బట్టిరి. వారినిఁ బట్టి తెచ్చుటకై విశ్వనాథనాయక ప్రముఖులు సన్నద్ధు లగుచుండఁగా రాయ లిట్లనెను. 'వెన్నిచ్చినవారిని వెంటాడుట మనకుఁ బౌరుషము గాదు. ఇఁక వారిగతికి వారిని బోనిండు.' నాయకులు వెంటనే వెనుదిరిగిరి. ప్రభునిచిత్తవృత్తి ననుసరించి శరణన్నవారి నెల్లరఁగాచిరి. ఆంధ్రసేన కానాఁడు చరిత్రాత్మకమైన మహావిజయము లభించెను. సలకము తిమ్మయ్యమాత్రము కానరాలేదు. అతఁడు బిజాపురమున బంధితుఁడై యుండవచ్చుననియు, నతనిని విడిపించుట యావశ్యకమనియుఁ దిమ్మరుసు రాయలను ప్రబోధించెను. తత్క్షణమే యాంధ్రవాహిని బిజాపురాభిముఖముగాఁ గదలెను.

నాఁ డాదిల్‌శాహి తన సభాభవనమునఁ గూర్చుండి రాయచూరు, ముదిగల్లు దుర్గములను దిరిగి రాఁబట్టు విషయమై యాప్తులతో మంత్రాంగ మొనర్చుచుండెను. అంతలో నొక చారుఁడు వగర్చుచు వచ్చి యతనికి నమస్కరించి 'ప్రభూ! ఆంధ్రచక్రవర్తి! ఆంధ్రచక్రవర్తి!' యనెను. ఆదిల్‌శాహి తత్తఱపాటుతో గద్దియ డిగ్గనుఱికి 'యెక్కడెక్కడ?' అనియెను. 'అదిగో! ఆ ధూళి యాంధ్రసేనల ధాటివలనఁ బుట్టినదే! ఒకటి రెండు గంటలలో నా సైన్యము కోటఁజేరఁగల' దని వాఁడు ప్రయాసపడుచు బదులుచెప్పెను. బిజాపురపతి తత్తఱపాటుతో నిఁకేమియుఁ బలుకక కొలువు విడిచి యచటఁ గనిపించిన యొక తురంగముపై నెక్కి పలాయితుఁ డయ్యెను. ఆస్థానోద్యోగులు కకావికలైరి. ఒకింత సేపటిలో రాయలవారు

నగరముఁ బ్రవేశించిరి. ఆదిల్‌శాహిపలాయన మాలించి నవ్వుకొనిరి. ఆదిల్‌శాహిచేఁ జెఱయం దుంపఁబడిన బహామనీ రాజకుమారులను బంధవిముక్తులఁ జేసి రాయ లం దగ్రజునకుఁ బట్టాభిషేక మొనర్చి యవనరాజ్యస్థాపనాచార్య బిరుదాంకితులైరి. సలకము తిమ్మయ తొలుతనే చెఱ విడిపింపఁబడెనని వేఱే చెప్ప నక్కఱలేదు. ఆ మహోత్సవ వేళఁ బెద్దనాది కవికోకిలము లిట్లు తెలుఁగుతేనె విక్రమక్రమమును గానము చేసినవి.

శా. 'శ్రీలీలాత్మజ! కృష్ణరాయ! సముదో
ర్వీ! నీదు వైరిక్షమా
పాలుర్వేఁగి, హయాధిరూఢులగుచుం
బాఱన్, వనీశాఖిశా
ఖా లగ్నాయతకేశపాశు లయి
యూఁగన్, గేకిసల్గొట్టి 'యు
య్యాలో జొంపలొ' యంచుఁ
బాడుదురు భిల్లాంభోజపత్త్రేక్షణల్.'

ఆంధ్రచాణక్యుని చిరతరకృషి నాఁటికి సమగ్రముగాఁ బండెను. ఆ పంటలో సర్వతోముఖమైన యాంధ్రప్రభ శాత్రవగ్రీష్మమై సాధునయన కౌముదియై వెలసెను. హంపీ విరూపాక్షాలయ ప్రత్యూదయ ఘంటానాదములలోఁ ద్రిలింగ విజయధ్వానములు నిరంతరములై మ్రోఁగెను. అష్టదిగ్గజముల ఘంటము లాకాశవాణులై దశదిశల కా మంజులారవములు శతాంతరములుగాఁ బ్రసారితము లొనర్పఁ బూనుకొనెను.

---